# ఉపోద్ఘాతము

చదువరులారా!

("వివేకభ్రష్టానాం భవతి వినిపాత శ్శతవిధః")

అను భర్తృహరిసుభాషితమున కుదాహరణముగ నుండునట్లు మా "శై చితులు" ప్రకటించిన "తిరుపతివేంకటేశ్వరార్ధశతకము" జదివియుఁ జదివిన వీరిలోఁ గొంద ఱెట్టియేవమును బొందిరో ఆసందర్భమును దెల్పు ములు గొన్నిటిని 41 వ పుటలో నుదాహరించియుంటిమి. లోకముచే గర్హింపఁ బడుచున్న తిప్పడుఁగూఁతల కుత్తరము వ్రాయుట వ్యర్థమని తలఁగియుఁ బ్రసక్తానుప్రసక్తముగాఁ గొన్ని లోకోపకారములగు సద్ధ నీవ్యాజమునఁ బ్రచురింపఁ దలఁచి యాతప్పడుఁగూఁతలనే గౌరవించి 'ఆ రాధనము' అనుపేరితో నీగీరతతృతీయభాగము ముద్రింపించితిమి. ఇ మున్నిది గీరతచతుర్థభాగముగా ముద్రింపించెద మని ప్రచురించి యుఁ కాని గుంటూరిసభలో దీనియందలి పద్యములు కొన్ని విన్నది మొదలెద్ద నిత్యమును వచ్చు నార్డర్లమితములుగా నుంటంజేసి లోకాభిరామాయణము దీనినే ముందు ప్రకటింపవలసినవారమైతిమి. అనేకమహావిషయము లున్నవి, అవి చదువరులే గ్రహింపఁగలరు అక్కడక్కడఁ గల విశే షానేకత్రి చేర్చి సమన్వయించుకొనువారికి బోధపడిన ట్లిది యితరులకు పడదు, కానఁ జదువరు లప్పట్ల జాగరూకులుగ నుండఁగోరెదము. ఇది లుండెె. ఈయనర్థశతకమును జూచి లోకులెల్ల నిష్ఠీవనమాచరించుచుం నీమర్యాద చాలక కాఁబోలు 'రామకృష్ణమ + హాభారత' మనఁదగు దాని "రామకృష్ణమహాభారత" మను నేతిబీఱకాయ నొకదానిని మనదైవం- లేవఁ దీసిరి. ఇది పడుచు, లేచుచు, చచ్చుచు, పుట్టుచు, "చచ్చిచెడి గంపెన్నపములు" కావించుచున్నది. ఇప్పటికి 128 పద్యములు, 24 7 పర్వములుగాఁ బలుమారు రోదనసంఖ్యాపర్వ మసమాప్తిలో నుండె మూల నాఁగిపోయినది- అపరిగల్భానృతవచఃపూరితమగు నియ్యది నా మెప్పులు ప్రాజ్ఞలోక మిట్లు గౌరవించుచున్నది.

"తిరిగి యీ నడుమ 'కవిత' పత్రికలో నిదివఱకు కృష్ణాపత్రికయందు:
ంచిన 'పరాస్తపాశుపతమును' ప్రచురించుచున్నారు. 'పాడిందే పాడరా
ఁడ్లదాసరి' అను సామెతకుఁ దగియున్నది. మీ గీరతమునకు మరల 'భార
' వ్రాయుచున్నవారలు. ప్రారంభపర్వముమాత్రము వ్రాసిరి, వ్రాసి
ారు దయచేసి వానికిఖండనముగా గ్రంథములు వ్రాయక యేవియో కొన్ని
ులు వ్రాసిన బాగుండును. కారణ మేమన? వారు వ్రాయుదానియందు
ుమర్శనముండదు కాఁబట్టి."

సికింద్రాబాదా (డక్కన్) చివుకుల అప్పయ్య. 24-9-13.

5-14. సికింద్రాబాదు, సెకండుబజారు.

"గీరత" ద్వితీయభాగమందలి సంబుద్ధిపర్వాదులను జూచిన రామకృష్ణసతీ
శాంతింతు రేమో యనుకొంటిని. మరల వారు తమ చేటభారతమందు,
యవివేక ప్రసారమును గుప్పుమ్మరించుచున్నారు. పదఱుకొననిండు. యీ
దు వారినిగూర్చి యేపపడని వివేకులు లేరు.

ముదిగొండ నాగలింగేశ్వరుఁడు.

(1) అబ్బో!, 'శతపర్వభారతంబఁట? మతిమంతులు వ్రాసిరంట?' ఇత్యా
ం కొంతవట్టు కాలుచున్నవి. స్థాణువు పల్లవశోభ నందవచ్చును గాని
ప త్రోవకు వచ్చునట్లులేదే? ఇది కలిమాహాత్మ్యము. కేవలము వారి లో
ాదు.

కలికాలంబ? భవన్మహత్త్వగిరిశృంగస్థానశృంగాటకో
చ్చలదత్యద్భుతచర్యపుణ్యజనవాచాకీచకస్వానని
స్తులసత్యప్రతిబంధకల్పనకు సంతోషించి భక్తాగ్రగ
ణ్యులు మ్రొక్కన్ పదివేలు మ్రొక్కెదరు మాయోపాయసంధానమా!

అని వేడఁ దగియున్నది, "బ్రహ్మాఽపి నరం నరంజయతి" కోటిలోనికి
ి..." శ్రీ॥ హ. 1-9-13.

"కవితఁ" జూచి యుందురు, అందు శ్రీ "వారి" భారతము బయల్పడినది.
భపర్వము ముందుదారిని సూచించుచేయున్నది. తత్త్వము లోక మెఱుఁ
గ్గటఁగూడ వీరి కీప్రయత్నములు శుభకరములు కావనియే ప్రాజ్ఞసంఘము
చున్నది... శ్రీ॥ హ॥ 20-9-13

"ఉ॥ "శిక్షయొనర్చి, యక్షరముఁజెప్పి, ప్రయోజకుఁ జేయు శి
దక్షుఁడనైతి నంచుఁ, గడుఁ దానవమానమొనర్చ్ఁగూళ్ల" అని శ్రీమూర్తి
శాలిక, రామకృష్ణకవులు మున్నగువారే, పయిసంగతికి సాధారమవుదుర
శృంఖలగాని, బృహద్భారతముగాని, భవత్ప్రీతిభాయాశః ప్రసరణములకు
బంధకములు కాఁజాలవు తాము మనుష్యమాత్రులుగా, నేపాణ్డిజ్ఞులచేత
పఁబడుటలేదు. మీ ప్రబంధరాజములను అందు మరియు మీగీరతాన్ర్వ
జదివిన విద్వత్కవులు, సాక్షాత్తుగ, మీరు తిరుపతి వేంకటేశ్వరులే యని
చుచుండిరి."

బాపట్లతాలూకా — జమ్ములమడక శ్రీ రా

పెదనందిపాడుపోష్టు. — కొండపాటూ

అతివిస్తరమేల. "పువ్వుపుట్టినతోడనే పరిమళము పుట్టినఁ
కంపు" అను సామెతకు మన సువివేకులభారతము ప్రథమోదాహరణమ
యింతవఱకుఁ గొంచెము తక్కువగా నేడుపర్వములు వెలువడిన దని
యుంటిమి. ఏడుపర్వములలోఁ దుట్టతుదిపర్వము పేరు 'పునరుక్తిపర్వమ
లోని యీ పద్యముంబట్టి చూడ నయ్యాల కప్పుడే నాడి వెనుకకు లాగుచు
మూర్ఖులకుఁ గూడ సుగమమే.

గీ. "చాటుపద్దెములెద్దాని జాటితెలిపె
శృంగభృంగమునందెద్ది చెప్పఁబడియె
సత్యసందేశమును దేనిసంప్రతించె,
నదియె వివరింపవలసె భంగ్యంతరమున"

ఏడవపర్వమునకుఁ బెట్టిన పేరుం బట్టియేమి, పైనుదాహరించిన పద్య
లకముం బట్టియేమి యయ్యాల భావిగతి సూచితమగుచున్నది. చాటుపద్దె, వ
నెఱుఁగని వారెవరు? శృంగభంగ సత్యసందేశములదుర్గతి నెఱుఁగని వా
ఆ ప్రశ్నలకు దములుతప్ప గతిలేని దేవయ్య లంత పెద్దపేరుతో వ్రాసెను దిగ
లకో? ఇప్పటికిని శృంగభంగ సత్యసందేశములనుగూర్చి సత్యాన్వేషకు
లు బ్రయత్నించి నిజమరసి "తస్య ప్రహరణములను" దగిలిం
యున్నారు. చూడుఁడు.

పాడు. 6-11-13

"నేను యీ నెల, 2-11-13 తేదీని కాకరపర్తిదగ్గిర నున్న "వడలి" గ్రామమునకు కార్యార్థినై వెళ్లియుంటిని. అక్కడికి కాకరపఱ్ఱు చాలా మని తెలిసినది. కాకరపర్తితగాదా విషయమై ఎవరినైనను కనుక్కొం నే కుతూహలముతో నుండగా, 3-11-13 తేదీని సాయంత్రం, 7 ఘంట కాకరపర్తినివాసులగు బ్ర॥ శ్రీ॥ కూచిభొట్ల మహాదేవయ్య, అనేవారు తట వారిని యీ తగాదా విషయమై నిజము యెంతవరకు, అని ప్రశ్నించితిని. యీ క్రిందివిధముగా చెప్పిరి. మీరు కాకరపర్తిలో సభ చేసినప్పుడు హడ అక్కడ నున్నాననిన్నీ తమరు ప్రథమంలో గ్రంథము (గిరతము) చుండగా అందరికీ చాలా సంతోషంగా నుండెనన్నీ తరువాత వారు యెవరో రచించిన పుస్తకమును మీకు చూపి భిప్రాయమును కోరగా అది మీకు నచ్చదన్నట్టున్నూ అక్కడనుంచి నున్నవారందరు అనేకవిధములుగా మిమ్ము అవమానించవలయు నని ట్టినట్టున్నూ అట్టివాండ్లలో తనకుమారుడుకూడా వుండినట్టున్నూ, వానిని మందలించినట్టున్నూ, చెప్పినారు. తమయందుమాత్రం ఏమీ లోపము , లోపము వాండ్రిదే ననిన్నీ మిమ్ములను ఎట్లాగైనా అవమానించా ండ్రిందరు అదివరకే అనుకొని వున్నట్టుగాకూడా వారు అభిప్రాయము చినారు యింకను బ్ర॥ శ్రీ॥ రామకృష్ణకవులలో కృష్ణకవి అనేవారు ర శుశ్రూషచేసి అవధానరహస్యములున్నూ ... మీవద్దనే తుదనెగ్గింపు ను సెలవిచ్చినారు. అంతేకాక మీకవిత్వముతో ఆవూరిలో ఎవరికవిత్వ సరితూగచాల దనిన్నీ మిమ్ములను జయింపలేరనిన్నీ బ్ర॥ శ్రీ॥ పెద మశాస్త్రులవారు పదిమందిలో చెపుతూ యుండగా తాను విన్నాననిన్నీ రు వారి సంభాషణవల్ల ముఖ్యపరిపోర్ట ఏమనగా, మోసము రాము వులదనిన్నీ, ఆవూరియందు యింకా కొంతమంది దనిన్నీ. తేలినది. నేను "లోపము ఎవరియందువుంటే వారిని మీవూరి పండితులు మంచ దా" అని అంటిని. అందుకు వారు రామకృష్ణకవులు అక్కడివారికి దగ్గరబంధువులు కావడమువల్ల ఏమీ అనుటకు వీలులేకున్నదనిన్నీ, వేంకటకవుల కీర్తి యితరులవల్ల పొయ్యేది కాదనిన్నీ, మావూరియం పెద్దలు పూరుకుండియున్నారు. అని సెలవుయిచ్చినారు. మీరు

ములో న్యాయముగా వెళ్ళినట్టు వారు చెప్పిన మాటలవల్ల నామనస్సుకు (తృ
చాలా సంతోషించినాను..."

T. KOTAYYA.

ఈ. టి. కోటయ్యగారి గ్రామ మెక్కడిది? గుంటూరు డి॥ లో సత్యాన్వేషణతత్పరత్వము తప్ప నీయన కీపరిశ్రమ మేల? సత్యజిజ్ఞాసు చేయు పరిశీలనమున కెన్నాళ్ళు చావక యసత్యజీవనుల పదరులు నిలువఁ గ అట్టిచో నా పాదుఁగూఁతలనే మరల మరల నేల పదరవలయునో? పైవి మును గూర్చినదే మఱియొక యుత్తరము.

"నాలుగుదినములకిందట బ్ర॥ శ్రీ॥ చెర్ల రామశాస్త్రిలగారును, వా బ్ర॥ శ్రీ॥ ఆణివిళ్ల సీతారామశాస్త్రిగారును యీగ్రామము లౌక్యసం॥ మువిూద విచ్చేసిరి. మమ్ముల జూడవచ్చిరి. పేరువినుటతోడనే, బ్ర॥ సీ॥ శా॥ గారిని "శృంగభంగపు" వ్రాతలనుగురించి ముచ్చటించితిని. బాలురచేష్టలును, తా నుచటి కేగుట మొ॥ సంగతులు చెప్పిరి; తమరం మంచితాత్పర్యం కలదు"

-7-13 ఏలూరు. మె॥ కృ॥

శైలింపఅచేతనో ప్రతిక్షణమున విమర్శింపఁబడుచు సిగ్గు తేల్పఁ సీ, యని రోయఁబడుచున్న తన కుకల్పనయం దింకను రామకృష్ణశాస్త్రికు భంగము కలుగనేలేదు పైఁగా నా, శృంగభంగసత్యసందేశములలో దానిని మేము మాగీకతమునఁ గైకొననేలేఁదట? గైకొన్న "శృంగభం వలనఁ దనకుఁ గలుగుచున్న మర్యాద చాలదా? పునరుక్తిప్రాయ మగు గూడ నేల గైకొనవలెనో? ఆ వ్యయమే యననేల? ప్రకృతవిషయ దానేది వ్రాసినను నయ్యది యపగ్రిగల్భాభిన్నృతమయముగానే యుండె యెవ్వ రెఱుంగనిది? శృంగభంగసత్యసందేశముల కర్తృత్వ మెవని బులుమఁబడినదో యా చర్ల చలపతి వర్తనముం బోలె నాయీ ప్రకటనను వెలుఁగఁ గల వని తలఁపని ప్రాజ్ఞు లెవరు? చర్ల చలపతి వర్తనము గాఢముగా గురుదక్షిణలో 15 వ పుటలో సూచింపఁబడినది. మఱికొంత యఁగోపువారు మాశిష్యుఁడు వెంకటరామయ్య కొకవేళ్లు విడిచిన పిచ యగు బ్ర॥ శ్రీ॥ ఓలేటి నారాయణశాస్త్రిలవారి సరిక్రొత్తయుపాసద్ధ మును ప్రశ్నింపఁ గోరెదము. అట్టి యుత్కృష్టునికి స్వాలకుఁడగుట క

గాని అందులకు దుఃఖింపక యవ్వానితో క్షీరనీరన్యాయమున నుండి సకల్పి
ప్రకటించుట తత్తుల్యత్వ సంపాదకము కాక తీరదు. కావుననే దూర
సైతము ప్రత్యయము చాలక రామకృష్ణుని వ్రాఁతలు ప్రతిపదమును విచ
చి తజ్ఞులవలన గుట్టుమట్టులను గనిపెట్టి త్యజించుచున్నా రనుసంశ మింతకు
ంపే సిద్ధాంతీకరింపఁబడినది. దానినే బలపఱుచు నతని స్వయంకృతా
బోధకము లగు నక్కరములు మఱికొన్ని చూపఁబడుచున్నవి.

(రా॥ కృ. భా. కథావతారపర్వమునుండి.)

1. ఒకతఱి రామకృష్ణకవులొద్దకు వెంకటశాస్త్రి చూడను
త్సుకుఁడును బోలె వచ్చి "తగుచోట నమంగొని మీగురుండుగాఁ
బ్రకటన సేయఁ గోరెద భవద్గురుతాపదలబ్ధి నాకుఁ గొం
డొకయుపకార మాయతిలెడుఁగా భవదీయనృపాలసన్నిధిన్.

2. వేసవికాల మేగుడును వెండియు నేమరుపెంతు మింతలో
మాసడి మీనృపాలుని సమక్షమునందుఁ బ్రసంగమార్గముం
జేసి చించింపుఁ డేను నృపశేఖరుదర్శన మబ్బ యత్నముల్
చేసెద"నంచుఁ జెల్మి మెయిఁ జెప్పెను దత్సమయోచితంబుగన్.

3. మంచిది "వేంకటేశ్వరుఁడు మాకు గురుం డని పల్కు మీకు లా
భించెడి దున్నదన్లై కలిపించెద" యంచు వచించి యాతనిం
బంచిరి రామకృష్ణు,లటు ప్రాప్తమనోరథుఁడౌట నాతఁ డిం
చించుక సంతసంపడియు నీసును వీడఁడు లేశ మేనియున్.

ఇట్లు వెం॥ శా॥ తమ్ము నాశ్రయించినది నిక్కమే యగునెడల నీయం
"అప్రస్తుత ప్రశంసలో" వ్రాయమానుటకుం గతము ప్రాజ్యము. వెం॥ శా॥
దర్శనార్థియే యగుచో వీరి నాశ్రయింపవలెనేమి? అసత్యమాడుపట్టులఁ
ఁ గొంత తెల్వి యుండవలయును. అదియే యున్నచో నీమా "దైవపం
' లీయంశమునుగూడ స్వాప్నికపర్వములో నేనిఁ జేర్చుకొనినఁ గొందఱు
న్నఁ గొందఱేని "పాపము వారికట్లు స్వప్నము వచ్చియుండఁబోలు" నని
కొనుటకైన దటస్థించునేమో? ఎట్లుతటస్థించెడిని? వాదిప్రతివాదులలో
పఁ డింకొకఁడు చెప్పినట్లు తన కనుకూలించు సంగతులను గిలికి "ఇట్లాతఁ
డు చెప్పె" నను ప్రశ్నము వచ్చినప్పుడు "స్వప్నమునం" దని యుత్తర

మిచ్చుచో నమ్మ తీర్పరు లెక్కడనుందురు? కావున నీస్వప్నప్రసంగ కూడ మా "దైవపంచితులు" శుద్ధాసత్యములను వదరు నికృష్టులని లోకుల జెప్పక చెప్పుట కేర్పడినదియే యని మేమిందు వేఱుగ వ్రాయనక్కఱలే. స్వప్నములో వెం॥ శా॥ చెప్పినట్టు లెన్నో సంగతులు కల్పింపఁబడినవి. అం రామకృష్ణమ్మకుఁ గల రిక్తమనోరథమును దెల్పెడు నొక యుపగల్భపుఁ మిట నుదాహరింపఁబడుచున్నది

ఉ. "పగ్గెకు మిమ్ము గెల్తు నని పల్కుచునుందును గాని కృష్ణుతో
నెగ్గఁగ లేము తిర్పతియు నేనును నాతని పేరు విన్నచో
దిగ్గురనున్ మనం? బెపుడు దృష్టమృగాధిపడింభమో యనన్
దిగ్గనఁ బైఁబడంగ నరుదెంచునో యంచు భయంబుఁ జెందుదున్."

పాపము వీని కెంత కోరికయున్నదో? అవును.

శ్లో. ఉత్పద్యంతే ప్రలీయంతే దరిద్రాణాం మనోరథాః
బాల్యవైధవ్య దగ్ధానాం కులస్త్రీణాం...వివ.
"రిక్తుని మనసుకోరికలు పెద్ద"

అది యటు లుండె. ఇట్లని వెం॥ శా॥, వెం॥ రా॥ లతోఁ బల్కినదెప్పు స్వప్నమునందు. స్వప్నఫలవేత్తలిట్టి పట్టున నర్థ మెట్లు చెప్పుదురు? "ఇట్టిన వెం॥ శా॥ వలన నీవెన్నఁడును విన నేరవు" అని చెప్పుదురు. అట్లేల చెప్ప నందురా? వేఱొకప్పుడు వెం॥ శా॥ యెదుటికి రాఁగానే నిలువునఁ రి యూసురు లెగిరి పోయినట్లు కల వచ్చె ననుకొనుఁడు. అయ్యది యట్లు జం వలసినదియే యగునోలు?

(దేవీభాగవత షష్ఠస్కంధమునుండి.)

శ్లో॥ నిద్రయా చాల్యతే చిత్తం భవన్తి స్వప్నసంభవాః। నానావిధ ష భేదాః... శ్లో॥ మృతం పితామహం స్వప్నే పశ్యతి స్వగృహాగతం; ప్రమోదయ మితి నిశ్చయః॥

దీని కిన్ని ప్రమాణము లెందులకు, నిజముగా స్వప్నము వచ్చెనో, శా॥ లట్లు వ్రాసినను నది వృథా, వీరలకట్టిస్వప్నమే రానిచో నిఁకఁ జెప్ప సినదేమి? స్వప్నము గాదుగాని యిది యొక జాతిప్రలాపసన్నిపాతప్రియ సుకవికార మైనఁ గావచ్చును. ఈవికల్పములకేమి, "రామకృష్ణమ్మకు, తి॥

ను జయింప వలయునను మనోరథ మున్నది. అట్టిశక్తి భగవంతుఁ డియ్య అందుచే నిట్టిపాటులు పడవలసివచ్చుచున్నది." ఇది సారము, పై మనో మెట్టిభయముతోఁ గలసి మెలసి వర్తించుచున్నదో, అభయ మెట్టితెల్వి ..క పరిసంగమును జేయించుచున్నదో, యీక్రిందిసాకులవలనఁ దెలిసికొన ను.

(రా॥ కృ॥ మ॥ భా॥ పునరుక్తిపర్వమునుండి)

॥... తారు తుల్యపదభాగులె మే మెనరేఁగి తాఁకఁగన్.

సమశీలోద్యోగులకున్, సమవిజ్ఞానులకు సమసుచారిత్రులకున్
మలో సఖ్యమును వివా, దము దగు నని వ్యాసభారతమ్మనలేదే."

ఇందుచేత తి॥ వెం॥ కవులు పిల్చినను వెం॥ రా॥ లు విద్యావివాదమునకు టు? సత్యమే కావచ్చును, వేదుల రామకృష్ణమ్మకీ విషయమైన పట్టుదల గాయున్నట్లు బలవత్తరమైన సాక్ష్యమున్నది గానఁ బై సంగతి విశ్వసించి యును. ఇతఁడు చర్ల చలపతితో వివాదమునకుఁ గాకున్నను వివాహము స్నేహమునకును నంగీకరించి యశ మార్జింప యత్నించుట లోకి మే! కిలాదులయం దితని కతఁడు సముఁడు. "సర్వం సంపన్నం". ఇకఁ యమునకు బీజభూతమగు భారతశ్లోకముదాహరించి కొండొక చర్చింప మున్నది.

యయోరేవ సమం విత్తం యయోరేవ సమం శ్రుతం
తయోర్వివాహ స్సఖ్యంచ నతు పుష్టవిపుష్టయోః

ఈశ్లోకమునకును ఆపద్యమునకును విశేషభేదమున్నను బరికృత మది గణ్యము గాదు. "పైవాక్య మెవరిది? ఎవరిని గూర్చినది? ఈవక్తకుఁదుట్టి ఁ బాప్తమైన గతియేమి" అనునది పరిస్థితము, పైవచనము రాజ్య ధుఁడగు ద్రుపదునిది, ద్రోణు నుద్దేశించి పలుకఁ బడినది. ద్రోణశిష్యులచేఁ దకు వక్తకుఁ దటస్థించినదుర్గతి సర్వవిదితము. కావున దానిననుకరించు గతి విచారింపనేల? ఔరా! దైవసంచితుల ప్రమాదములు! "నీదయా, -, నిచ్ఛయా". ఇంతతెల్వితక్కువలో నున్న తమరప? †ఉన్నతస్థానమం

---

† ఉ॥ క్రిందుగనున్న వాఁడు... తెగియించు... ఉన్నతిం బొందినవాఁడు దియమందు...॥ (రా॥ కృ. భా. పునరుక్తిపర్వము చూ.)

గున్నారమ ! తి॥ వెం॥ కవులమ! అర్థస్థానమున నున్నారమ! వీరి కో
నిచ్చినను లాభమేనమ! తమకో? యోడిన నష్టమమ! కావున విద్యావివ
నకు రారమ! అంతియకాని సామర్థ్య మేమో చాలానున్నదమ !!!
యున్నతస్థానస్థితి, సిగ్గుసిగ్గు

"ఎన్నఁడు నెఱుఁగనివాని కేగానిదొరకితే యెందులోఁ బెట్టనేకందుల బు

అది యటులుండె, ఇప్పటి కచ్చయినంతవఱకా వీరి నేతిబీఱ
భారత మిట్టియప్రగల్భానృతోక్తులతో నిండి యున్నయది, అందింతః
చెప్పినకథాంశమేమియును లేదు. "కథావతారపర్వమని" ప్రారంః
అందు మాశిష్యుఁడు చదివినగురువులను గొండొక పేర్కొనిరి, అందు
శాస్త్రిని మొట్టమొదట వదలిరి, పదపడి జ్ఞప్తికివచ్చి కాఁబోలు.

ఉ. ...చెళ పిళ
ఖ్యాకునితో నెటో చదివెఁ గౌముది నిర్వదినాల్గుపత్రముల్.

అని యొకచోఁ దప్పుతుఁగూఁత నొకదానిని గూసిరి. ఈ కూఁతః
లేదు. లేవన్నందులకు * అప్రస్తుత ప్రసంశలో వ్రాసిన 'శ్రీప్రత్యయాం
అనునదియే సాక్షి. శ్రీప్రత్యయాంతము 24 పుటలలో నిమిడియున్న
సంపుటములు కానరావు. చదివినది శ్రీప్రత్యయాంతమును గాదుః
వానికిఁ గౌముదిలో నెన్నియక్షరములు వచ్చునో అవియన్నియు వెం॥
శిష్యుయే యని పంచభూతములును సూర్యచంద్రులును దజ్ఞులును నెఱుః
కాన విస్తరింపఁ బనిలేదు. యీఅ పరస్పరవిరుద్ధాప్రగల్భానృతవాక్యః
గాగితములు చెఱుచు మా దేవయ్యలకు జాగ్రత్సన్నిపాత మంకురించిన దని
మానింపఁ దగు నంశములుగూడ నానేతిబీఱకాయలోనే కలవు. అంః
వృథాగా పింజరగ్రామమును బట్టుక పడఁదిట్టుట. దీనింగూర్చి యీగ్రి
తుట్టపుటను గొండొక విమర్శింపఁ బడి యున్నది. 49 వ పుట మొదలు
చూడుఁడు మఱియు నాయీ యీపర్వములలో నూ 'దైవవంచితులు, వ
వంచితులు సంగ్రహముగాఁ దెల్పుచున్నారము. "వెం॥ శా॥ గారికి శాస్త్రి

---

* "వెంకటశాస్త్రిగారిపద్ద వెంకటరామశాస్త్రిగారు వ్యాకః
ప్రారంభించి కొన్నిమాసములకుఁ గౌముదిలో శ్రీప్రత్యయాంతమే— వ
నేమి, చదివిరి. (అప్రస్తుతప్రశంస చూ.)

, మాయకవిత్వము వచ్చును. శ్రవణానంద, పాణిగృహీతా, నానారాజ
ృన, పాండవాశ్వమేధములు పనికిమాలిన చెత్తపుస్తకములు; గీరత మిన్నిటి
బాడు. దీనిం జదివినవారికిఁ బాపము. వెం॥ శా॥ గారి యాజ్ఞమీద నే
ాభారతము వ్రాయుచున్నారము. స్వప్నములో వచ్చి, వెం॥ శా॥ తాబు
వి యొప్పికొనియెను. వెం॥ శా॥ వ్యాసమూర్తిశాస్త్రులవారికి మున్నె
విందు చేసి విలువగల నూత్నవస్త్రములు కట్టఁ బెట్టెను. కావున వ్యాస
ర్తిశాస్త్రులవారు చాల గొప్పవారు. వీరి కతఁ డొనర్చిన విందు శబరి శ్రీరా
గారి కొనర్చిన విందువంటిది.'' ఇత్యాదులు వ్రాయఁబడినవి. ఇందులో
ంమాట మాత్రము సత్యము. కాని శ్రీశాస్త్రులవారికి శబరివలె వెం॥ శా॥
లిపదార్థములను పెట్టెనని వ్యంగ్యమర్యాదచే స్ఫురించునట్లువ్రాయుట
మను దోసము. మఱియు నీవిందు వ్యాసమూర్తిశాస్త్రులవారు పెద్దలు
కులు బంధుసముద్రులు అను గౌరవము వెం। శా। కిఁ గలపనుటకే బోధక
ా గాని వారి కవిత్వమన్న నతని కేమము లేదని తెల్పుటకుఁ బనికిరాదు.
కవిత్వమునందు లోకుల కెంత గౌరవమో, వెం॥ శా॥ కిని వంశియు య
ెలుఁగుచుండుఁగాక. అది యటులుండె. ఇట్లే అనుపయుక్తములగు మఱి
సంగతులు వ్రాయఁబడియున్నవి, అనునది ప్రకృతము. ఆ వ్రాసిన సంప
ులోఁ దక్కినవి విమర్శనకు నాఁగనియసత్యము లగుట యంత తప్పుగాదు
వింజరదూషణ ముపానత్ప్రయోగార్హమని యనని వా రుండఁగూడదు.
ము ప్రచురించునెడల నంతవఱకు వచ్చుటయు, దానిపై నవి కొన్నిమాసము
తుట్టతుద కొక సీసపద్యములో నాగాస్త్రములలోఁ గొంచఱను భూషించి
కాయపిచ్చికొండ" చేయుటయుఁ బలువు రెఱుఁగుదురు. మఱియు
ా తప్పుడుభారతములో వెం॥ శా॥ గారి విూసములనుగూర్చి తాము
ెంపలేదనియు, చేమో యనియుఁ గొంత వ్రాలపింపఁబడినది. 'రా
పఁ బనిగానరాదు మాకు' అనుదానికిఁ జెల్పితక్కువగా వ్యాఖ్యాన మొనర్పఁ
. దానివలనఁ దేలు సారము "మీరు వచ్చునెడల మేము మిమ్ము గెల్పిం
ాని మిమ్ము జయించుట కే ప్రదేశమునకేని మేము వత్తుము. వచ్చుట
మే కాదు. విధిగా జయింతుము. అనునది, అగున్నో నొకపరి బందరు
మునకే వచ్చుట యుక్తము. ఇందునుగూర్చి, గీరత 1 భాగము 45
ోని "తే॥ గీ॥ బందరే వచ్చి" అను పద్యము చూడఁదగు. ఎప్పుడుపత్త్రో
నెడల సభ యేర్పఱిచి వారి రాకకై ప్రతీక్షింపఁబడును. చేప యే

యున్నచో శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావు బహద్దరువారి షష్టిపూర్తికా ఱింపఁ బడి 'పత్రి' మని యంగీకృతిం జెప్పి కూడఁ బలాయనమంత్రము న చెప్పుటకుఁ గత మేమో యెఱుఁగనివా రెవ్వరు? "పిల్లి కనులు మూసి పాలు ద్రావిన" దని జాఁగు కెట్లు. ఇందుఁగూర్చి యీపత్త్రమున 51, 52 ప్ర చూడఁదగు. అయినా సంపర్కమువల్లఁ బలికిందువారికది 'రామకృష్ణమ ÷ హా తేముగా.' గన్పట్టిక యెట్లునూనెతె. అది యటులుండె గీరత ముత్తమగ మని తెల్పఁదగు నుత్తరము లెన్నో, 1, 2, భాగములలోఁ జూపఁబ డెజ్మాత్ర మీభాగమందును బ్రచురించితిమి. కాని యెన్నో యుత్త లింకను మిగిలియున్నవి. కొన్ని యిటఁ జూపఁబడుచున్నవి.

(1) ఉ॥ శ్రీపతి వేంకటేశకవి సింహములార! శతావధాన వి। భా భాగభాసకలాంధ్రిక రాధరసత్సభా ప్రభా। దీపకకీర్త్యదంచితవిధిప్రిరణ కులార! సత్కృతి। స్థాపకులార! నేఁ దమపదంబులకుం బ్రణతుల్ ఘ చెదన్॥ చ॥ చరితములందు గీరతము చాలకసాకరమయ్యె నీతి। విస్ఫుర గాంచనయ్యె, గురుసూరులమన్నన హెచ్చనయ్యె నేఁ। డసదుగ 'సీమ'ఁ చరిత మాద్యులు తాము రచించినట్లు నే। నెఱిఁగి లిఖించు నొక్కప్రతి నీ కుందయసేయ వీ. పి. గాన్॥ క॥ అప్పతనోధయుకవ్రులం। 'దున్యత్క్రీత్రిప్ర యుక్తులకలనన్। హృద్యులగు తమకు నే నన। పద్యప్రణతిం బొనర్చి వము గాంతున్. 6-3-13.

(2) తాముప్రచురించిన 'గురుదక్షిణను' జూచితిని, ఇంతకు ముందటి ప భాగముం జదివియుంటిని. ఇక్కాలమున శిష్యహితోపదేశము చేయ ని వృత్తిగ్రంథమును రచియించి, లోకోపకృతిబొనర్చుచున్న తమ్ము మ సహ కొనియాడుచు నొక్క గురుదక్షిణను వీ.పి. గా దయచేయఁ బ్రార్థించుచున్నా

గుంటూరు — పెరవలి, పార్వతీశశాస్త్రి,

16-11-13. — ఏ, ఈ, ఎల్, ఎమ్, కాలేజీ, సహాయాంధ్రోపాధ్యాయ



పెద్దింటి హయగ్రీవస్వామి అనేక ప్రణామములు సా॥ ఆన్యాపటం పాలెంపోష్టు, కాకినాడతాలూకా, గోదావరిడిస్ట్రిక్టు. తాము చెప్పిన గీ నాకు నక ప్రతివెంటనే వీ. పీ. గా దయచేయించుటకు ప్రార్థించుచున

ంవరుల కపరిమితానంద దాయకమని మన ప్రెసిడెన్సీ యంతయు కీర్తివిస్తరిం
ం. గాన సదరు గ్రంథము చదువనెంతో వేడుక కలిగి యీ విజ్ఞాపనపత్రిక
్రసినాను. ది 16-11-13.

---

తమ రిదివరకు రచించిన గ్రంథములు కొన్ని మాత్రము నావద్ద నున్నవి.
ను, సర్వజనోపయుక్తంబై, కల్పభూరుహంబువలె సకలార్థదానశాలియై, కాల
సంబుచందంబున గంభీరధ్వని విరాజితంబై, భారత కథావిధంబున, నానా
సమస్తపదభూయిష్ఠంబై, యొప్పారుచున్న గీరత ప్రథమభాగమును జూడ
డెందం బమందానంద తుందిలంబయ్యె. మల్లాది వెంకటసుబ్బయ్య, గుంటూరు

14-3-1913.

---

19-1-13.

తమ గీరతము నామూలాగ్రముగఁ జదివితిని. మిక్కిలి యొప్పును దెలు
ు నానంద మొసఁగూర్చుచున్నది.

ప్రరాణం, రామచంద్రశాస్త్రి. ముక్త్యాల (సంస్థానం) కృష్ణాడి॥

సీ॥ సరవిఁ గృతఘ్నుల జక్కాడి జయమొంది ప్రభవిల్లు మీపాండుపతము
...భారతప్రతిజ్ఞనైఁ బండితకోటిని దన్పెడు మీగీరతమ్ము గంటి..."

దార్వేముల, వెంకటశేషశాస్త్రి. 22-3-14

గోపువానిపాలెం, వీపూరుపోష్టు, వినుకొండతా॥ గుంటూరుడి॥

ఇక్లెండలో నిర్వ్యాజముగా నుతించు పాత్రమును వెం॥ రా! కల్లు తిట్టిన
ప్రయోజనము? అదిగాక వారేని స్వార్థచిత్తులై వ్రాయు వ్రాతలో నిందిం
న్నారా? పాపము! గీరతమును జదివి అవసరముం బట్టి ఖండింపనెంచి వీలు
చేయు "మహాభారతము" లోఁగదా తిట్టుచున్నారు. దుఃఖసముద్రములో
.గినవా రేమన్నను నవి వాక్యాలు పాటింపఁ దగదు. అదియటులుండె. చూచి
కొని "మహాభారతము" సత్యమునకుఁ జాలదూరముగ నగపడుచున్నది. కాని
ాత్రిపాదు లనుకూలముగ నున్నవని జెప్పుటకు సందియము లేదు. అందికిగ్రంద
ఖను, వెం॥ రా॥ లెంకకో వ్రాసికొనియుండిరి.

.కపండితుఁ డొకపామరుఁ, డొకలోకంబైన నేమి తాయి యనఁజెచ్చున్
గలమ్మం దముఁ దెగడిన, స్వకీయదోషమును దెలియఁజాలఁడు కుకవుల్.'

లోకులు వీరి ప్రవృత్తిని గుఱించి యేవపడుటనుగూర్చి గీరతమెల్లెడఁ ప్రమాణము లిచ్చియుంటిమి. అవి చదివి యీ పద్యమును జదివికొన్నవారి కుల కుదాహరణమును వేఱుగ వెదకవలసి యుండదు గదా? ఇఁక నసత్య ముల ప్రతిజ్ఞ లెట్లుండునో తెలిసికొనఁదగునొక యుదాహరణము మాత్ర వెం॥ రా॥ ల "మహాభారతము" నుండి చూపుచున్నారము.

తే. గీ. 'అనృతవిషయమ్ము లెల్ల సత్యములు గాఁగఁ
జెప్పి మెప్పులు గొనుట మాచేతఁ గాదు
ఉన్న దున్నట్లు వ్రాసెద మొప్పఁ దప్పఁ
జెప్ప రారయ్య పండితశ్రేష్ఠులార.'

పండితశ్రేష్ఠులు రావలయునఁట!, పాప! యెంతధైర్యమున్నదియో, ఇందలి వ్యంగ్యమువలన గీరతమును లోకమెల్ల మెచ్చె ననుటకుఁ బ్రతిపక్ష గూడ నొప్పికొనక తప్పక వచ్చినది యని విస్పష్ట మగుచున్నది. అందనృత యమే యున్నదో సూనృతమే యున్నదో తెల్పవలసిన యావశ్యకత లేదు. యాంశమును సాధింపఁదగు లోకాభిప్రాయము లుదాహరించి యుంటిమి. "ముంజేతికంకణమున కద్దమెందులకు" "జగమెఱిఁగిన బ్రాహ్మణునకు మెందులకు" "నీరుపల్లమెఱుఁగు నిజముదేవుఁ డెఱుఁగు" కొన్నిటి యందలి మును గని పెట్టుటకు దేవునివఱకుం బోవలయును గాని "పట్టపగటి దొంగతన వ్రాఁతల యందలి సత్యమును గని పెట్టుట కెవ్వరేనియుఁ జాలుదురు. అట్టి తలను వ్రాయుచు మా వెం॥ రా॥ లు లోకమును విశ్వసింపఁ జేయవలయు విశ్వప్రయత్నము చేయుచున్నారు. వారెన్ని యొట్లు, యసత్యములు, సంగతిసందర్భములు ప్రకటించుచున్నను నయ్యవి గని లోకు లేవగించు చునే యున్నారు. అట్టిస్థితిలో వారొనర్పఁదగిన దేమి? పాపము స్వయ తాపరాధము వలని ఫల మనుభవింపవలసినదే. ఒక యసత్యమునకై తొ తొమ్మిది యసత్యములను లిఖించి వానివలన లోకులచే గర్హితు లగుట దుర్దశ యొండుండెడినా? ఉండదు.

శ్లో॥ అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫల ముచ్యతే॥

అనుట కింతకన్న దృష్టాంత మేమి కావలయును, ముందు గురుత్వ దాఁచి "పిడప స్త్రీప్రత్యయాంతము వఱ" కని బొంకి పదపడి 24 ప

...త్రమే యని "నాసాఁటికిఁ దీసికట్టు నాగంభట్టు" గాఁ బాట్లు పడుచున్న ... వెం॥ రా॥ల కష్టమును భగవంతుఁడే పాలింపవలయును. స్త్రీప్రత్యయాంత ...న్నప్పుడు సుమారు సగమును, యిప్పుడు మరల నా సగములో సగమును ...పింపఁ జేసిరి. దీనివలన వెం॥ రా॥ గురుత్వ మేమో క్షీణించు నని తలఁచు ...ండిరి గాని యయ్యది "యాదవ కులపు ముసలము" వలె నెంత యణుగఁ ...న నంత విస్తరించి చేయఁదగు పనిని జేసియే తీరునని మాత్రము గుఱుతింపఁ ...లకున్నారు. "స్త్రీప్రత్యయాంతము" కొన్ని ప్రతులలో 63 పుటలు, కొన్ని ...లో 58 పుటలు, కొన్నిటిలో 49 పుటలుగను గానవచ్చెడిని. యిందుఁ దక్కువ ...ఖ్యను గైకొన్నచో 24 దానిలో సగభాగముగఁ బరిణమించెడిని. యింతలో ...ంత స్త్రీలింగములు ప్రారంభ మగును. తక్కిన సంగతు లెటులున్నను వెంకట ...మయ్యకుఁ గౌముదిలో శబ్దాధికారము గూడఁ దుదముట్ట లేదని పై వ్రాఁతల ...నఁ దేలును. అగుచో నితఁడు "శాబ్దికజీవుఁ" డెట్లగునో? ఈ "శాబ్దికజీవ" ...మునకై వ్యాఖ్యానాదుల వఱకుఁ బోకున్నను గౌముదిలో మఱికొంతయేని ...పవలయును గాన నాభాగమునకు గురువులను వెదకవలయును, చర్లనారా ...ణశాస్త్రి గారినే పేర్కొందమన్నచో నాయన యొద్ద లఘుకౌముది ...త్రమే చదివినట్లు వ్రాసిన వ్రాఁత బాధించును. (చర్లనారాయణ బుధేంద్రు ...కతమునఁ । గావ్య నాటకాదులు లఘు కౌముదియును) (రా, కృ, మ, భా. ...వతార పర్వము చూ.) ఇఁక—

"గణుతి గలవ్యాసముఖబుధణులపై" (రా, కృ, మ, భా, క, ప, చూ.)

నన్యాయముగా నీభారము మోపవలెను, గాని యిందులకు వారును నంగీ ...పరు. పైఁగా——

("తటస్థించినపుడు...క్షణశఃకణశః.") (రా, కృ, మ, భా, క, ప, చూ.)

అను "గోడమీఁదిపిల్లి, వ్రాఁత" యంత భారమును మోపుటకుఁ దోడ్ప... ఇఁక నెవ్వరి యందీభారమును మోపవలెనో చదువరులే విచారింపవల...ను. వెంకటరామయ్య కౌముదిలో 24 పుటలు మాత్రమే కాని స్త్రీప్రత్య...ంతము మాత్రమే కాని చదివె ననునది సత్యదూరము. అంతకన్నఁ జాల నధి...ు చదివెను. గురువును మాత్రము వెదక వలెను. యెంతవఱకుఁ జదివెనో ...కాభిరామాయణ పీఠికలో వివరింతుము. ప్రకృత మీ యిసుకపాఁతఱ ...నుండి యింతతో విరమింతుము. వీరి యసత్యములను జూపుట కింతవఱకుఁ ...దవలసి వచ్చినది. గాని ప్రస్తుత మగు విగ్రహారాధనమునకును దీనికిని ...త్తిగా సంబంధమే లేదని మేమెఱుఁగుదుము.

ఇట్లు,

తిరుపతి వేంకటేశ్వరులు.

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# గీ ర త ము

## వి గ్ర హా రా ధ న ము

శ్లో. స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం, న్యాయేన్యమార్గేణ మహీం మహీ
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం, లోకా స్సమస్తా స్సుఖినో భ

శ్లో. కాలే వర్షతు పర్జన్యః, పృథివీ సస్యశాలినీ
దేశోఽయం క్షోభరహితో, బ్రాహ్మణా స్సన్తు నిర్భయాః.

శ్లో. అపుత్రాః పుత్రిణ స్సన్తు, పుత్రిణ స్సన్తు పౌత్రిణః
అధనా స్సధనా స్సన్తు, జీవన్తు శరదాం శతమ్.

శ్లో. మఙ్గళం భగవన్ విష్ణో, మఙ్గళం మధుసూదన
మఙ్గళం పుణ్డరీకాక్ష, మఙ్గళం గరుడధ్వజ.

శ్లో. నీలాచలనివాసాయ, నిత్యాయ పరమాత్మనే
సుభద్రాప్రాణనాథాయ, జగన్నాథాయ మఙ్గళమ్.

శ్లో. ఉపనయతు మఙ్గళం వ, స్సకలజగన్మఙ్గళాలయ శ్శ్రీమాన్
దివకరకిరణనిబోధిత, నవనళినదళేక్షణో రామః" శ్రీ. శ్రీ. శ్రీ.

# గీరతము

## గ్రంథప్రారంభము

కర్ణమలప్రభూతమధుకైటభఘాతుకదుష్కృతఘ్న తా
మ్రార్ణయహారి శౌరిఁ దలఁతున్ మధుసూదను వేంకటేశ్వరా
ఖ్యార్ణసమాప్తవిద్యు, రచితాగను, వేంకటరాము, దుర్వచః
పూర్ణముఖాంతరున్ వినయపుంజసమంజసుఁగా నొనర్పఁగన్. 1

సరియా నుత్తర మొండు లేమి నసురాచార్యుండవై వేంకటే
శ్వరునిం దిట్టఁ దలంచి స్వాంతగతవిశ్వాసమ్ముఁ బోఁద్రుంచి యీ
శ్వరదూరంబగు దుర్మతం బొకఁడు సంపాదించి యాశౌర ! ము
ష్కరగవాక్యమ్ములు వెళ్ళఁ గ్రక్కెదె, కృతఘ్నగ్రామచూడామణీ ! 2

అనృత మ్మన్న గుడమ్ము నీకు, గురుదేవామ్నాయనిందాప్తి జీ
వనమే నీకుఁ, గుమార్గవర్తన మనన్ స్వారాజ్యమే నీకు ని
న్నన నేమున్నది ? జన్మకాల మటు సవ్యాసవ్యభేదమ్ములన్
గనఁగా నీక కలంచుచుండె, నెటు శక్యం బట్టిచో నర్భకా ? 3

వెంకనఁ దిట్టిపోయు నల వెంకనతోడ నభేద మొందు నీ
కంకెను; రామకృష్ణులను నట్టు లభేదము చేసి తిట్ట నే
జంకఁగనేల ? కైత యది సాగదొ ? లేఖిని వ్రాయదో ? వృథా
పంకమునందు బ్రుంగుటకుఁ బ్రాజ్ఞుఁ డెవండు కడంగు నర్భకా, 4

ఏఁబది చెప్పి యుంటి, "విఁక నేఁబది చెప్పఁగ నుంటి" నంటి; వీఁ
డేఁబదు లెన్ని చెప్పఁగలఁ డిట్టియభేదము పట్టెనేని యో
శాబక ! యుద్ధరంగమున శాతకృపాణిక పాణి నూని దు
ర్ధీబహుళారికంఠములు ద్రెంచునొ ? త్రెంచుకొనం దలంచునో. 5

తిట్టన్ రాదని కాని యట్టి దొకసందేహమ్మె లేకున్నచో
నెట్లో చెప్పుము రామకృష్ణులకు నిశ్రేయత్వసంసిద్ధి ? తి
గ్గట్టన్ బొల్చెడి వేంకటేశ్వరున కేరున్ దోసమున్ వీసమున్
గట్టంగా వినఁబోము కృష్ణున కటుల్ గాఁదెంచువా రున్నచో. 6

జారుం డనఁగవచ్చుఁ జోరుం డనఁగవచ్చు
బానిసమగఁ డంచుఁ బలుకవచ్చు

# విగ్రహారాధనము

స్త్రీఘ్నుం డనఁగవచ్చు గోఘ్నుం డనఁగవచ్చుఁ
బసులకాపరి యటంచుఁ బలుకవచ్చుఁ
గల్లరిఁ డనవచ్చుఁ గొల్లఱేఁ డనవచ్చుఁ
బల్లెవాఁడని చుల్కఁ బల్కవచ్చు
ఉత్తముం డనవచ్చు సత్తముం డనవచ్చుఁ
జాఱుఁబోతని నొక్కి పలుకవచ్చు

గీ. చాకివాఁ డని యనవచ్చు సన్న 'బొంగు'
పెదవిఁజేర్చెడివాఁడని వదరవచ్చు;
ఏమనిన నేమి భక్తి యొక్కింతగల్గి?
యేమనక యేమి యది లేని హీనజనుఁడు!

సీ. చెడుకంపు గొట్టెడి చేఁప గాఁ జెల్లదో?
తాబేలని వచింపఁ దప్పు గలదో?
పంకానఁ బొరలాడు పంది నాఁ జెల్లదో?
అరమానిసి యటన్న నతుకదొక్కొ?
బలి నాశ్రయించిన పాఱువాఁ డనరాదో?
మాతృఘాతుకుఁ డన్నమాట తగదో?
తండ్రి 'హాహా'మ్మన్న ధన్యుండనఁగ రాదో?
త్రాగుఁబోతనుమాట తగనిదగునా?

గీ. తిండిపో తన్నఁ జెల్లదో? మొండిజగ్గఁ
డన్న సరిగాదో? కలికిగా నాడరాదో?
అతని పూర్వోత్తరమ్ముల నరసి భక్తి
గల్గి యేమన్న దొసఁగొండు గలుగఁబోదు.

సీ. విధవనాజి యటన్న బుధులొప్పరో? విషా
శ్రయుఁడన్న సత్కవీశ్వరులు వినరో?
క్షీరహితుం డన్న సూరు లొప్పరో? యశో
దాదారకుం డంచు వేదు లనరో?
నరకాభిగామి యన్న మహాత్ము లొప్పరో?
స్థిరగదుం డన విపశ్చితులు కనరో?

## గీ ర త ము

హతశిశుపాలకుం డనరొకో విజ్ఞులు ?
గోత్రోద్ధరణుఁ డనుకొనరొ కవులు ?

గీ. ఎందుఁ గురుకులవిద్వేషి యీతఁ డనఁగ
వచ్చు, నీశునక మ్మనవచ్చు; నిచ్చ
భక్తి యొక్కింత యేనియుఁ బాదుకొన్న
వాఁ, డితరుఁ డేమి యన్నను వమ్ము నమ్ము. 9

గీ. తల్లికి మగండు, * లంజకు ధవుఁడు, నోట
మన్ను గొట్టుకొనినవాఁడు, మామగారి
కొంప గూల్చినవాఁ, డత్తఁ గొనరువాఁడు
లోనగు పదంబు లెన్నియు నేని గలవు. 10

తే. గీ. అన్ని పదములు భగవంతునందుఁ జెల్లు
నన్ని శ్లేషలు వానికి నన్యథా స
మంజసార్థప్రదము లయి మలయు; వాని
పేరు ధరియించుచోటఁ జేకూఱు నెట్లు ? 11

తే. గీ. మంచిగంధపుఁజెక్కలసంచి రాస
భంబు లెటు లట్లు యా భగవంతునామ
మందఱును బేర్మి ధరియింతు; రంతమాత్రఁ
దత్తదుచితంబులు గొనాలు దవులఁ బోవు. 12

రుపతి వెంకనయనఁగాఁ, దిరుపతి వెంకినయే యనుచుఁ * వెగఁబొగడిరి కొం
లు; నీవో తెగఁడిట్టితి, విరుమతముల దేవతాత్వమే న స్వైనసెక్. 13

* లంజా, లక్ష్మీః, (ఏష్టి, నిఘంటువు చూ.)

* తిరుపతి వెంకటేశ్వర నామము తనకు సార్థకమేయగుచున్నది... హాకలియందు దేవరవారు నామమాత్రమున నే గాక ... యు...ము... .మును...విచారించిన శ్రీ తిరుపతి వెంకటేశ్వరుని ఖ్యాతిఁ జెలంగిరన్న యు నొప్పిదమే యగుచున్నది..."

వేలూరి సుబ్రహ్మణ్యం, అమరపరం, భద్రాచలంపోస్టు, 4-8-13

షరా:- ఈవిషయమున కెన్నేని యుత్తరములున్నను విస్తర
కి నొకటి మాత్రమే యుదాహరించి మిన్నకుంటిమి.

# విగ్రహారాధనము

ఆ. వె. హితుల నుతుల కే మహితుఁడ వయ్యెను నీవు, నన్ను దేవుఁ జేసినావు-
నతనియంశ మేదొ యధిక మందఁ జకన్న, నన్నుఁ జెందినట్టు లెన్నవః

ఉ. తిట్టిన నేమి, నీవుడువు తిట్లు మహాత్తకు సాక్ష్య మిచ్చె; నా
“కొట్టియు నేతిలోఁబడియె”; రోసముతోఁ బని లేదు గాని నీ
పట్టినపట్టు తప్పు, పలుపాపము లక్కటనం బొనర్చుచు
న్నట్టులు నాకుఁ దోఁచు; నవి యడ్డెద శక్తికొలంది నందుచే.

ఉ. ఏదియొ హేతు వుండవలె నించుక, తిర్పతివేంకటేశు మ
ర్యాదకు వీఁడు పాల్పడుట యున్నది యూరక యెట్టులబ్బు? వీఁ
డేదెసవాఁడు? తిర్పతి మతేదెసవాఁ? డెటు లిర్వు రేకమై
రో? దురితప్రచారుకు నూరక గోచర మేల కావలెన్.

ఉ. అందుకె కాదు, పూర్వకృత మన్నది యెందులకేని తప్పు; దే
వందయొ తక్క నీవుడికి బద్ధుఁడు గాని వివేకి లేఁడు; యిం
తెందుకు? నీవు దేవగురుహేళన సల్పుటకేని యేదియో
కందు పురాకృతం బొకటి కల్గియ తీరవలెన్ గుమారకా.

ఉ. కర్మవశంబ కాక యిటుగాఁ దెగియుంతువె? బుద్ధిచెప్పఁడుం
గర్మము వంటి పోవు; నది కార్యముచే ననుమేయ మయ్యె; నే
కర్మము త్రిప్ప నాతరము గాదని కొంత యెఱింగియుండియున్
ధర్మము గామిఁ గొండొక వృథా ప్రలపింతు ఘనస్థితార్థినై.

ఉ. కాన సమస్తమానవులు గర్మపుదాసులు, నిక్కమింతె; య
ద్దాని కతాననే యెటులొ దక్కెను దిర్పతివేంకటేశు నా
మానఁ బ్రసిద్ధి చెందఁగల మాన్యత నా; కిఁకఁ నీకొ? దక్కె న
ద్దానసె వేంకటేశగురుదైవతవైరకృతాపచారముల్.

గీ. ఒకఁడు వేంకటరాముఁ డింకొకఁడు రామ
కృష్ణుఁ డింటిలోఁ గొంచె గిలుబుఁజేసి
ప్రాఁకినా రెట్లొ వేంకటరామకృష్ణ
పదవి; కీపాట్లు మాకుఁ జొప్పడవు తనయ !

ఉ. వేంకటనేతఁ దిట్టినను వేంకట నామము మోము ప్రొక్కి న
వంక మడంచుచున్న యది; బాలక! ‘వేంకటఁ’ దీసికొన్న న

ర్వాంకము రామకృష్ణునిదె యౌ; నొక “రామ” పదమ్ములోన మీ
రింక నడంగఁగా వలయు నిర్వురు భావుకు లెంత కష్టమో ? 21

‘వేంకటరామ’ లోనఁ గల వేంకట శబ్దముఁ దీసి, రామకృ
ష్ణాంకము లోని రామ పద మట్టులె యూడఁగఁ బీఁకి, రామకృ
ష్ణాంకము దాల్చినన్ గురునియాకృతి వేరనఁ దోఁపకుండు; మీ
రింక నటుల్ పొనర్పఁజను; హేయపు “వేంకట” నామ మేటికిన్ ? 22

ఏ యవివేకియో యొకరుఁ డెట్టులొ * మీసములం దగిల్చి ‘పి
న్నాయన !’ యంచుఁ బిల్చెనఁట నాయన చెల్లెలి; నట్లె వెంకనన్
బాయఁగఁ దోఁచి నీవు గురుపట్టపుఁ బీఠమునందుఁ జర్లనా
రాయణు నిల్పుపూనికయుఁ బ్రాజ్ఞులకుం గనుపట్టు నర్భకా! 23

ఏ యొకలేశమో నొడువులే నిజ, మంతన నీకుఁ జర్లనా
రాయణుఁ డొజ్జయై యొరుఁడు రాఁడయు నప్పయు నయ్యెనేమి ? నన్
డాయఁగ వచ్చినప్పు డొకటన్ మును కాఁకరపర్తిఁ జర్లనా
రాయణుఁడే పఠించెఁ జుమియర్భక ! తద్గురుతాల్పుతాగతిన్. 24

ఏకాక్షరప్రదాతృత, చేకొనియుం గురునిగాఁగఁ జెప్పికొనఁగ నౌ;
నాకిడి యక్షరజ, మీతని, నేకతనన్ దోఁయఁగల్గి తెలఁగింపవనా! 25

వేంకటశైల దేవుపయి వేరము పుట్టుటఁజేసి వానిపా
పాంకము దాల్చువెంకనయు నట్టిఁడ యయ్యెను ? బాగుబాగహో !
“వేంకట” యన్ పద మ్మరిది, వీడుము దాని; * నరిప్రతిష్ఠితం
బంకము పెట్టుకోఁడగని దంపరు పెద్ద లెఱుంగు మర్భకా. 26

గీ. “కాలు పట్టుక పడలాఁగఁగాఁగడంగఁ,
జూరుపట్టుక వ్రేలాడు” తీరుదోఁచె :
“బొంగరి బుజానఁ బెట్టుక పొమ్మటన్నఁ,”
బోక వెంకన నీపేర దేఁకుఁ గంటె ? 27

---

* “సీ. మేనత్తమూతికి మీసమ్ములంటించి పిన్నాయనాయని పిల్చినట్లు.”

* “ఘోష వదాద్యంత రంతస్థం...(అనరిప్రతిష్ఠితం)... నామ కుర్యాదితి
రణ సంప్రదాయవిదో యాజ్ఞికాః.

# విగ్రహారాధనము

ఉ. పేరది మార్చికొమ్ము, పయి వేంకటనేతభయంబు నీకు దు
ర్వారము గాకయుండు; కులపద్ధతి మున్నుగఁ గొన్ని మార్చుకోఁ
గోరిన నీకుఁ జేరొకటి కొండొక మార్చిన నేమి పోవు ? ని
స్సారపుఁ ద్రోవ ద్రొక్కెదవె ? చాలు నిఁకన్ విడు మీదురంతమ

ఉ. ఎట్టికులమ్మునన్ బొడమి, తెట్టియపాత్రపుఁద్రోవఁ బాపపుం
గు ట్టిగఁ బ్రాకుమంటివి? ఇది కూడదునూ, కసి గల్గెనేని నన్
దిట్టుము మిన్నకుండెదను; దేవునిఁ దిట్టకు, మెల్లలోకముల్
దిట్టి శపించు ని, న్నొకట దేఁకుదు నంచను కోకు మూర్ఖకా.

ఉ. ఎందులకేని యేగవలె నెక్కడకేనియు, "వీఁడె వీఁడె యా
నిందకుఁ," డంచు వ్రేలిడొన నిన్ గనిపించుచు నొండొరుల్ పారి
ముందర వెన్క నాడుకొన ముచ్చముడుంగుట యెంత కష్ట ? మే
నిందకు సైఁచినన్ ద్రిభువనీపతి నిందకు సైఁప రెవ్వరున్.

☞ పరా:—చదువరులారా? ఈ పైని, వెం॥ రా॥ ల॥ తి.
వేంకటేశ్వరార్థ శతకమునుండి గొన్నిపద్యములనెత్తి చూపుచు వానికి
ధించిన మాసిద్ధాంతములను దెల్పుపద్యములు నెలకొల్పుదుము. వెం॥
యుక్త పరిసంగము సర్వమును జూడఁగోరువారు, వారియర్థశతకము
గాఁ జూడఁగోరుచున్నాము. తి॥ వెం॥

(...సకలాంధ్ర జగమ్మున కీపవేల్పవై వెలయఁగ లేదుగా...)

శా. నాకున్ దేవుఁడె, నీకు దేవుఁడె సుమీ నాయన్న! వెంకన్న; యే
లోకుల్ వానిని సన్నుతింతు రఘువల్లుల్ దెంపఁగా; నాంధ్రప్రజ
లోకంబం దొకకొంత గాదు పదునాల్గున్ లోకముల్ గూడ న
య్యేకాకారుని గొల్తు రెరో ఐమతుల్ హీనుల్ జడాత్ముల్ వినా.

(...ఏరాజమహేంద్రమందిరవరమ్మున నీకుఁ బ్రతిష్ఠ గల్గె...)

ఉ. రాజమహేంద్రమందిరవరానఁ బ్రతిష్ఠయె లేదుగా? మహా
రాజనతాంఘ్రి వేంకటపరాత్పరమూర్తికిఁ; *పీఠికాపురీ

---

*(1910 సం॥ 1-2- సంచికలుఆర్యమతబోధినుండి)
శ్రీతిరుపతి వేంకటేశ్వర మాహాత్మ్యము.

"శ్లో॥ శ్రీవృషాంబరహేతీనాం సుషమావహమూర్తయే, సర్వా
నాయాఽస్తు వేంకటేశాయమంగళం." (వేంకటేశ్వరస్తోత్రం)

# గీరతము

రాజమహేంద్రిమందిరవరంబునఁ గల్గినపూజహూడ నీ
కో జడబుద్ధి! సుంతయిన నూహకు రాదది యేమికర్మమో. 3

(పామరులైన దాసరులు బ్రహ్మరథమ్మును బట్టి దేవతాగ్రామణివీవె
యంచును ముఖస్తుతి సేయుచునుండ్రు.)

"పామరులైన దాసరులు పట్టిరి బ్రహ్మరథం" బటంటివి; వా
నామము నెట్లు వ్రాసితి వనాథజనంబులు పట్టినప్పు? డీ

---

ఈకలియుగములో వేంకటేశ్వరుఁడు ప్రత్యక్షదైవమై యున్నాఁడు. అనే పెద్దలు "కలౌ వెంకటనాయకః" అని నుడివియున్నారు. వేంకటేశ్వ ర్తత్రాణపరాయణుఁడు. ఈతఁడు నతజనుల బాధలుమాన్ప, తిరుపతిలో ాద్రియందు వేంచేసియున్నాఁడు. నిక్కమైనభక్తితో నీదైవమును న డింగకీంద్రు సర్వవిధములగు బాధలనుండియుఁ దొలంగి సుఖపడుదురు. నఁ బ్రతివత్సరమును వేలకొలఁది భక్తులు తిరుపతివేంకటేశ్వరుల దర్శనము ోయి యాత్రికహితులై గతకిల్బిషులై తమతమ నిలయంబులకుఁ జనుచుం ఇయ్యది యాస్తికులగు హిందువులకెల్ల బాగుగాఁ దెలిసినవిషయమే. ు నిప్పుడు మనహిందువులలోనే కొందఱు క్రీస్తుమతవికారమగు బ్రహ్మమతమును గ్రహించుకొని యీప్రత్యక్షదైవతముయొక్క మహిమను సందేహించుచున్నారు. సందేహించుటయేకాదు, భక్తిచే వేంకటేశ్వ సేవించు సాధుజనులఁ బరిపరివిధముల నిందించుచున్నారు. ఇట్టి వారికిఁ దనమహిమ బోధపడి వారు కూడఁ దనభక్తులై తరింపవలెనను వత్సలత్వ గాఁబోలు గాఢముగా నీబ్రాహ్మమతప్రభ ప్రకాశించుచున్న బ్రహ్మసామాజిక శిబిరములలోనే తనదివ్యమహిమను శ్రీవేంకటేశ్వరులు చున్నారు. ఈనడుమనే యీక్రింది మహాద్భుతము జరిగినది.

పిఠాపురపు సంస్థానాధిపతులై శ్రీవేంకటేశ్వర పాదభక్తులై యాస్తిక ణులై కీర్తిశేషులయిన శ్రీరాజారావు గంగాధర రామారావు బహదరు భార్యలలో శ్రీరాజా భావయమ్మరావుబహదరుగా రనువారొకరు పిఠా సంస్థానాధిపతుల యింటనే యున్నారు. వీరొక సంవత్సరమునుండి వ్యాధిచే మిక్కిలి బాధపడుచుండిరి. ఏమి తినినను ఇముడుటలేదు. మం ) పుచ్చుకొనినను దత్క్షణమే వెళ్ళిపోయెడివి. దాన దేహము చాల

# విగ్రహారాధనము

వేమతితోఁ గొల్చి? బ్రహ్మరథ మెవ్వరు పట్టిన సార్థకంబొ వా
రే మతి పట్టి; రూర కరు లేడ్చి కృశించిన నేమగుఁ సుతా.

చ. ధనికడ దాస్య మూను నొక దాసర, వేంకటనాథుపాదపం
దనమున దాస్యముల్ సలుపు దాసులు పామరు లంచు దూఱుటల్

శుష్కీభూతమై పోయినది. ఇప్పటి సంస్థానాధిపతులు తమ కామెయం భక్తిచే ననేకవిధ ఘనవైద్యులచే వైద్యము చేయించిరి. అలోపథీ, హోమి మున్నగు పథములెల్ల నయినవి. ఆయుర్వైద్యశిఖామణులగు పండిత గో చారిగారిని చెన్నపురినుండి రప్పించి వారిచే వైద్యము చేయించినారు. యేమియుఁ గార్యము లేకపోయినది. మానవప్రయత్నమంతయు నీవిధ నిష్ఫలముకాఁగా నప్పుడా సాధ్వీమణి తనకు దైవమే శరణమని నిక్క నమ్మి తమ యిలువేల్పగు వెంకటేశ్వరుని "అన్యథాశరణం నాస్తి త్వమేవ మమ" యని యంతరంగమునఁ బ్రార్థింప మొదలుపెట్టినది. భక్తవత్సల వేంకటేశ్వరుఁడు తన్నునే నమ్మిన యీభక్తురాలిపైఁ గరుణకలవాఁడై నాఁడామెయం దావేశమై "నాకొండకు వచ్చి నన్ను దర్శించినయెడల నీ నివారితమగు" నని పలికినాఁడు. అప్పటికి వ్యాధి మిక్కిలి హెచ్చుగాన కొండకు వచ్చెద నని మ్రొక్కికొనినది మొదలు వ్యాధి నివారించునని వే శ్వరులు వచించిరి ఈవార్తను పీఠాపురపు సంస్థానాధిపతిగారికిఁ వారు బాధ నివారణమగునెడలఁ దప్పక యట్లు మ్రొక్కుకొనవలసినదే మిక్కిలి సంతసముగాఁ బలికిరి. ఆమెయందుఁగల భక్తిచే వారా మ్రొ చెల్లించుట కంగీకరించిరి. వారిమాటపై యాసతి యట్లు మ్రొక్కికొ అదియేమి యద్భుతమో! ఆ వేంకటేశ్వరుని ప్రభావ మెట్టిదో! గాని మె కొనినదాదిగా నారోగమంతయు మటుమాయమై పోయినది. తినిన ప ల్లెల్ల వెళ్ళిపోకుండ నిముడఁజొచ్చెను ఈ శుభవర్తమానము సంస్థాన గారికిఁ దెలుపఁగా వారాశ్చర్యచకితులైరఁట! ఆమె భుజించువేళఁ చ్చటనుండి భుజించినపిమ్మట గంటవఱకును నచ్చటనే యుండి తినినపద దుటపడు గని యామెను వెంటనే మ్రొక్కికొనినప్రకారముగాఁ దిరుపతి చిరి. ఆమె తిరుపతివెళ్ళి స్వామిని దర్శించివచ్చిరి. ఇప్పు డారోగ్యస్థి దుంచినది. ఇక్కడ నామె భక్తి, శ్రీ వేంకటేశ్వరుల మహిమ, శ్రీపీఠా

కనిన వివేకి సైఁపఁడు, వికావికనవ్వు, నహో! ధనంబు* దం
ధన మని తిట్టుఁ; బామరులు ద్రవ్యపుబాను, లొరల్ వివేకులే. 34

గారి సరసతయు, చాల వర్ణనీయముగా నున్నవి. నిక్కమగు భక్తియెన్నఁ వృథాగాఁబోదు. "సర్వార్తి శమనాయాస్తు వేంకటేశాయ మంగళం."

(1911 సం॥ 1, 2 సంచికలు, ఆర్యమతబోధినినుండి)
(వేంకటనాయకుని మహిమ.)

కలికాలదైవతమగు వేంకటనాయకుఁడు తనమహిమనంతను నిప్పుడు పిఠాకోటలోఁ జూపుచున్నాఁడు. కీర్తిశేషులయిన వెనుకటి పిఠాపురపు గారి రాణులలో నొక్కరు బహుకాలము తీఱనివ్యాధిచే బాధపడి తుదకు కేశ్వరుని దయచే నారోగ్యస్థితి నందెనని వ్రాసియుంటిమి. ఈసాధ్వి కు మరల రుగ్మత్తకలిగినదంట. అంత దానికిఁ గారణము నారయఁబోఁగా నామెయందు వేంకటేశ్వరు లావేశమై యిప్పటిరాజుగారికిఁ బుత్రిలా కలిగినప్పుడు తనకు 1116 రూపాయల ముడుపు చెల్లింతుమని వాగ్దానము ను జెల్లింపనందున నీరోగము మరల నంకురించెనని నుడివెనంట. ఆపలు ప్పటిరాజుగా రాలించి జరిమానాసహితముగా 1116 రూపాయలను వేంక కలగుడికిఁ బంపఁగా నీసతీమణి రుగ్మత్తయంతయుఁ దృటిలో నివారిత నంట! ఆహా? వేంకటేశ్వరుని మహిమ చాల వర్ణనీయముకదా. నిక్క క్తిగలచోట దైవమహిమ కాన్పింపకపోదు.

(శ్రీ వేదాంతదేశికస్వామివారి శ్లోకములు)

శరీరపతనావధి ప్రభునిషేవణాపాదనా
దబింధనధనంజయప్రశమదం ధనం దంధనం
ధనంజయవివర్ధనం ధన ముదూఢగోవర్ధనం
సుసాధన మబాధనం సుమనసాం సమారాధనం.

కాచాయ నీచం కమనీయవాచా, మోచాఫలస్వాదుముచా న యాచే
స్థితేఽనుచేలే శ్రితమానుచేలే, దయానుచేలే ధనదత్కుచేలే.

సిలం కి మనలం భవే దనల మూదరం బాధితుం
పయఃప్రస్మృతిపూరకం కిము న ధారకం సారసం

# విగ్రహారాధనము

ఉ. కూఁతున కత్తె సేరిడి రగుల్కొను కోపముకల్మిఁ గుంపటన్
బాఁతినరీతి నెందులకొ పాడునడుల్ జగదీశుఁ బల్కు నీ
వాతివివేక మే మనఁగ వచ్చుఁ గుమార? విభుండు నిన్నెటో
నీతికిఁ ద్రిప్పి దోసము గణింపక నాకయి ప్రోచుఁగావుతన్.

మ. "గురులన్ దూఱుటత" ప్పటంచు సుజనుల్ గొండాడ, "లెక్కే
పరనే దూఱెద నే" నటంచుఁ గవితన్ బాటించుని తెల్వి కె
వ్వరు శోకింపరె? నీకు శ్రేయ మెటులో ప్రాప్తించుతన్ వేంక
శ్వరుఁడే నా కయి ప్రేమఁ జూపుచు భవద్వ్యాచాలతల్ సైఁపుచున్

సీ. వేంకటేశ్వరుఁడు నీవెకలితనం బోర్చి రక్షించుఁగాక మాపక్షమండి
యతని దేవేరి మహాలక్ష్మి పతికోప ముపశమింపించి నిన్నోముఁగాక
ఆదేవు రెండవపైదలి భూదేవి క్షమ నిన్నుఁజూచి శ్రేయ మిడుఁగాక
యతని ప్రేమ విడిచాన యాత్మఒబుద్ధి నీపై నుంచి నీల కాపాడుఁగాక
తే. గీ. అతని కావాస మగు వేంకటాచలంబు
నీదోసంగు లడంచి మన్నించి "వేంక
టపతి" యనెడుమాట సార్థకగతి నెసంగ
సద్వ్రశముఁ బొందుటకు నిన్ను సాఁకుఁగాక.

("దేవుడు గొట్టునై బయలు దేఱును తిర్పతి వేం...")

ఉ. "దేవుడుగొ" ట్టటంచు నలదేవుని దిట్టెడి నీదు వాల్కకున్
శ్రీవిభుఁ డల్గకుండుత; స్వసేవ యొనర్చెడి నాకునై సదా
నీ వెటు ప్రేలినన్ సయిచి నీకు శుభం బొసఁగూర్చి నన్ను సం
భావన సేయుతన్ జగతిఁ బండితమండలి మెచ్చునట్లుగన్.

మ. "పగనైనన్ పగనైనఁ బ్రాణభయమున్ బ్రాపించియైనన్ సదా
భగవన్నామ మెదం దలంచుటయహో భాగ్యంబు, ముక్తుండు వాఁ
డగు" నంచున్ వచియించు గ్రంథములు; నీ వద్దేవునిం దిట్టియో
ే గడింపం గల వమ్మహాత్మ్యపదము న్నిక్కమ్ము సుమ్మర్భకా.
మ. "చిరకాలమ్మునఁ గాని భక్తిమెయి వాసిం గొల్చి పొందంగనే
రరు తద్దేవుని పాదపద్మనము; నై రం బూనుచో శీఘ్రమే

---

అయత్నమలమల్లకం పథి పటచ్చరం కచ్చరం
భజన్తి విబుధా ముధాహ్యహహ కుక్షితః కుక్షితః

యరయం జాలుదు" రంచు విందు; మది తథ్యమ్మైనచో నీ కగున్
ద్వరలోఁ దిర్పతివేంకటేశపదపద్మప్రాప్తి యాత్రారతిన్. 40

పదివలఱ కీశ్వరుండవఁట ?...నీకొకయయ్య...వైష్ణవంబిడినవాఁడఁట)

హరుఁడే కా, యల వేంకటేశ్వరుఁడు ము? న్నల్లేయగుంగాక నో
రఱుగన్ దిట్టితి రుష్టుఁ డయ్యె నతఁ; డీయత్యాహితం బాఁగ నీ
గురుముఖ్యుండె గలండు, దేశికుని కౌఁగిల్ గట్టి దుష్టత్వమున్
బోరయన్ జేసెద వేది దిక్కు ? * శివుఁడున్ బూనండ యిప్పట్టునన్.

హరుఁడే దేశికు నడ్డఁజాలఁ డనుచో నన్యామరశ్రేణికిం
దరమే? వారలయంశ మింత గల ధన్యమ్మన్యసంసారు లె
వ్వరికేనిం దరమే? శరణ్య మెదియో వాక్రుత్తు నీ వేంకటే
శ్వరుఁడే నూ! యల వేంకటేశుఁడును గావన్ లేఁడ యిప్పట్టునన్. 42

"దేవుఁడె లేని మానిసికి దేశికుఁ డెక్కఁడిదుండిపచ్చు" నం
చీవల నింతకాలమున కించుక బోధకు వచ్చె; మేలు! నీ
చేవ, సెబాసు! నీపదను, సీ! వహవా! ధవదాస్తికత్వ, వి
త్రోవను బోవుసాహసికి ద్రోహము చేయఁగ రాని దుండునే. 43

ఆ. వె. "అమ్మచెవులు ద్రెంచు నమలాత్ములకు నెంచఁ
బిన్నతల్లిచెవులు బీఱపూలుఁ
గావు" దేవుఁ డిట్టు గడుసుమానిసి కుపా
ధ్యాయుఁ డిట్టు లెంత తప్పిదంబు. 44

(జాతికి అప్పకు మ్రొక్కఁజెల్లునే)

తొలి నతఁ డీశ్వరుం డగుచుఁ దోఁచియు వేంకటనప్రవృత్తిఁ దె
న్నలరెను వేంకటేశుఁడుగ; నజ్ఞులరజ్ఞులకేమి, సోమయా
జులు మును గొల్చు వేల్పు వలెఁ జు మ్మతఁడౌ హరియున్ హరుండును; మూ
ర్ఖుల కతఁ డొక్కఁడాయియు నగున్ దలదిమ్మ వడల్చపట్టునన్. 45

రాతిని దిట్టి తా "నొకయరాతిని తిట్టితి" నంచు నెంచు నే
వీతనయుండు, వాఁ డొకట వేరము భారము గాఁగ నెత్తితో

శ్లో॥ * శివక్రోధాద్గురుస్త్రాతా, గురుక్రోధాచ్ఛివో నచ॥ (గురుగీత)

# విగ్రహారాధనము

రాతిని బొట్టు పెట్టియు "నగాతిని మెట్టితి"నంచు నెంచుఁ జు
మ్మోత్రతనయా! వివేక మిటు లూరుచు నున్నది నాఁడు నాఁటికిన్.

ఉ. రాతి కరాతి వైరి, వలరాతిని దేవుఁడె యున్నచోఁ బురా
రాతి కరాతి వైరివి, భరం బడి మైమయిఁ బోవ దమ్మ్రరా
రాతి కరాతివైరివి, పురాతనవిజ్ఞులు రోసినట్టి దీ
భూతిమతంబు; దీనఁ బరభూతియు వక్త్రవిభూతియున్ జెడున్.

చ. తిలకము లేనిమోము పితృదేవత లాడటఁ జూచి "యక్కటా!
తిల + కము మాకు నున్న" యని తిట్టి శపింతు రటం చెఱుంగ రే
యలఁతులు, వారితోఁ బఁబడి యర్భక! చక్కని యన్వయంబు తి
ప్పల కెరఁ జేసి తంచు పగపన్ వలసెన్, దలిసెన్ భపద్గతుల్.

(దేవుఁడ నౌదువేని... వేంకటేశ్వరా)

ఉ. "దేవుఁడ నౌదువేని" యని దిట్టతనాన నెదో వచించి; తా
దేవుని కింతమాత్రమునఁ దీపరిత పుట్టగు; ముందు మొక్కి కో,
మ్మ్రా నెనుకన్ నిరాదరణ కగ్గము గ మ్మ్రపు డేమి యానో? యా
దేవుని దేవతాగరిమ తెల్ల మగు న్నిముసమ్ము లోసలన్.

శా. నేనే యించుక చర్చ చేసితిని నీ నేరంబు వారింప;నీ
వేనోళ్లో యెర వొందు తెచ్చికొని యెంతేఁ బ్రేలు, మా వేంకటే
శానుం డీయపుల్ గణింపఁడు, శిలాసౌజన్యమే చూపు నీ
పై; నేమందువొ?* "యాదృశీ" యనెడివిద్వద్వాణి దుర్వాణియే.

(మహాత్మ్రుడు విగ్రహపూజ గాదనెన్)

ఉ. స్వచ్ఛపువంశమున్ గణన సల్పవ, పెద్దలమాట లెక్క లే,
దిచ్చకు వచ్చినట్టులుగ నేవియొ పల్లదము ల్లిఖించి యే
మ్లేచ్ఛమతంబొ పట్టి పయిమిక్కిలి దేవునిఁగూడఁ దిట్టి సం
పచ్ఛకలంబుకోస మిటు పాటుపడందగునే కుమారకా.

(విగ్రహారాధన సేయరెవ్వరు)

ఉ. విగ్రహమున్ త్యజించి గురువిగ్రహమున్ వల కెత్తికొంటివి, నీ
కాగ్రహచార మెట్లయిన నావలకున్ జనదయ్యె; నిన్ను నే

---

తిల + కము, తిలోదకము,

*శ్లో॥ యాదృశీ భావనాయత్ర సిద్ధి ర్భవతి తాదృశీ.

# గీ ర త ము

దో గ్రహ మొండు చెడ్డదయి యోగ్యతకుం గడు దవ్వొనర్చె; నీ
వాగ్రహతృప్తి కీమతము నందితి వంతయు నే నెఱుంగుదున్. ౫౨

(శంకరపాదుఁ డర్చికోపాసన నీసడించెను)

కావలె భార్య, పుత్రులును గావలె, ద్రవ్యము గావలెన్, మఱిం
గావలె సౌఖ్యముల్, మఱియుఁ గావలె సర్వము; విగ్రహమ్ము పోఁ
గావలెనే కుమార ? సరిగా విను "విగ్రహపూజనమ్ము మూ
ర్ఖావళి" కందు వేని యెటు లార్యులు శంకరముఖ్యులొప్పిరో. ౫౩

(వ్యాసమతంబు... నేఁడు క్రొత్తగాఁ జేసినదారిగా దిది)

వ్యాసులవారు సూత్రముల బ్రహ్మముఁ దెల్పి పురాణమందుఁద
ద్భాసుర చిద్విలాసముల భంగులు దెల్పిన వారు; సూత్రవి
న్యాసము చూపి తక్కుగల సంగతులన్ ద్యజియించువారు స
న్న్యాసులు, భ్రష్టు లౌదురు గృహస్థు లటుల్ చరియింపఁ బూనినన్. ౫౪

ఉ. అన్నిటి కేకవాక్యతగ నారసి చూచిన విగ్రహంబు సం
పన్న గృహస్థు కోస మనుభావము దేలెడి, నిర్గుణాత్మ నె
న్నన్నఁగ నేర్చు వీఁడు ? గుణమే కడుముఖ్యము గాఁ దెలంగు నీ
సన్న యెఱుంగ రూరకయ జందెము ద్రెంపెడి గేస్తు లర్భకా. ౫౫

ఉ. వ్యాసులు బ్రహ్మముం దలఁచి యాతని విగ్రహరూపమం దెదో
గోసముఁ బూని తిట్టు మనిరో ? విని రోయుదు రిట్టి క్రోవ జి
జ్ఞాసువు లర్భకా ! యిటులు కాసరకూసర బోధసేయఁ డా
వ్యాసుఁడు; దీని నింక నొకవ్యాసు నుపాసితుఁ జేసి నేర్చితే ? ౫౬

ఉ. వ్యాసమతమ్ముఁ బట్టి యలబ్రహ్మముఁ గొల్తువుగాక, యేడ దీ
కూసుమతంబు ? దేవగురుకోపమహాపదవాప్తసర్వస
న్న్యాసకృతంబు; నీపలుకు లర్థములేని పదార్థపర్దనా
భ్యాసపు వ్యాసముల్ గిలుకువారలకాఱు లసారముల్ సుమీ.

ఉ. వ్యాసుం డీమత మొప్పెనే ? కటకటా ! వ్యాసాశయం బెట్లు ? స
న్న్యాసుల్ పోవుపథంబు గేస్తులకుఁగా వ్యాసుఁడు శాసించునే ?
దాసీ దాసకళత్రపుత్రవితతిన్ దౌదవ్వులం దోలకే
లా ? సంసారికిఁ గర్మబంధ మది వాలాయమ్ము డీలయ్యెడిన్. ౫౮

# విగ్రహారాధనము

ఉ. శంకరు లొప్పినారు మతషట్కము; విగ్రహపూజయందు ని
శ్శంకమె షట్కమున్; జడులసంగతి నిప్పటియట్ల పాపపుం
బంకముగా జగంబు నిలుపన్ గమకించినయార్యుఁ డాతఁడే
శంకరుఁ బోఁడు, వ్యాసమతసర్వరహస్యవిదుండు గాఁడొకో.

క. శంకరమతమ్ము గా దిది, సంకరమత మైన నగును; శంకరుఁ డెట్లా
శాంకరిని బీఠమున ని, శ్శంకమ్ముగ నుంచి పూజ సల్పెఁ గుమారా.

మ. తల బోడిం బొనరించి, జందెములు తద్దం ద్రెంచి, "సన్యాసిపో
కలు గాఁ బోదు" మటందు రెవ్వ రలవా ర్యంజాత్ములన్ వీడ, రే
తలఁపుల్ మానరు, "దేవళం" బనిన నిందల్ సేతు; రీచెట్టపో
కలు నీ కేగతి నచ్చెఁ దుష్టతుదకున్ గార్హస్థ్యసంచారికిన్ ?

శా. ఏకర్మమ్మును వారు మానరుసుమీ ! యీ కర్మమే తక్క; నీ
వీకర్మంబన నేమిగాఁ దలఁచెదో ? యేకర్మ మార్యుల్ బుధ
శ్లోకుల్ శ్రీకరు లప్పదీక్షితముఖుల్ శోధించిరో వేదవి
ద్యాకంజాతభవావతారు; లది యేతచ్ఛబ్దతో బోధ్యమా,

శా. జ్ఞానప్రాప్తి కనేక మార్గములు విజ్ఞానుల్ ప్రసంగించి ర
య్యానందాత్ముని కిన్ని మార్గములు తుల్యంబుల్ సుమీ. విగ్రహా
ధీశుల్ గొందఱు గల్గుమాత్రముననే దేశంబు గోల్పెత్తెనే ?
జ్ఞానం బూరక కల్గునే ? యదియు నంగళ్లమ్ము క్రియ్యామ్మొకో !

మ. ఎవఁడో యొక్కని కబ్బెఁగాక శ్రమ లేకే జ్ఞానసంపత్తి; యిం
కవనిన్ దక్కినవార లెల్లరును నట్లోవారె ? యవ్వారికై
శివవిష్ణ్వాలయముల్ చెలంగుత; మెటుల్ శిష్యుండ ! నీ కప్డె నీ
యవివేకంప్రమతంబు? దేవగురునిందానందసంధాయియై.

ఉ. వేదములందు లేదనుచు విగ్రహపూజన మొప్పరంట ! యీ
వాదులు గొంద; ఱయ్యదియ వాస్తవ మందము; మూఁడుప్రొటలున్
సాదము మెక్కి కుల్కుఁ డని సాటెడు వేదము లేదెచ్చుచున్నదే ?
లేదట భుక్తికిన్ విధి; యశీకము గా దది మాన రాదొకో.

శా. ఏమీ, వేదము నంతమున్ దెలిసియే యీ మెట్టవేదాంతపుం
బూమె ల్వ్యాప్తైనె ? దీనికిన్ ఫల మెదో పోనిమ్ము యోజింత, మా

ర్యామోదం బడి తప్పిపోవుట, యుపాధ్యాయాగ్రహోదగ్రసం
గ్రామారంభము నెత్తిపైఁ బడుటయుంగా కన్యముం గల్గునే ?. ౬౬

ఉ. తిరుపతివేంకటేశ్వరుని దిట్టితివే యను, మట్టితిట్లకున్
దుగకలు దూరకుల్ మఱియుఁ దొల్లిటిపెద్దలహద్దు లెట్టివో
యెఱుఁగనిమోజకుల్ గద సహింతురు; వీరలమెచ్చు సత్కవీ
శ్వరులకు వారిశిష్యుల కసహ్య మెఱుంగుదువో, యెఱుంగవో ! ౬౭

ఉ. ఇతరకులస్థుఁ డేమతము నేని గ్రహించిన నంత నష్టి లే;
దతులము బ్రాహ్మణాన్వయమునం దుదయించి పితామహాదులున్
బితరులు వోవుమార్గములు పిప్పిగ నెంచి స్వతంత్రులై శ్రుతి
స్మృతిశ్రుతిదూరమైనగతిఁ జెందినవారియవస్థ శోచ్యమా. ౬౮

రామానుజాదు లందఱు, నీమాత్రము తెల్వి లేకయే విగ్రహపూ
జామంత్రము లొప్పిరిగా?, యేమీ సాహసము తుడకు నెందు వినితివే. ౬౯

(సలాముఁ జేసి గుడిదూరెదు తిర్పతివేంకటేశ్వరా?)

ఉ. ఒరి మనవేంకటేశుఁడు "సలామిడు" నంటె; "సలాం" పదమ్ము చేఁ
దెలియఁగ నర్థ్య 'మల్కు' కని; దేవుఁడు వానికి నల్గఁడే చుమీ,
"మలక పదమ్ము సాచి తను మల్టడు నర్చకుఁ గొట్టె జేపి" యన్
పలుకు లెఱుంగవే తనయ? ఫ్రిష్టుతోఁ బనియేమి సామికిన్. ౭౦

తలఁకుచు...వండము పెట్టఁగవచ్చువారి నే తలగొట్టెగించి...చెప్పుతో...
గొట్టెదవు)

ఉ. తలఁకెడివారికే విభునిదండన, 'మేనుఁగుఁ జూచి భీతిమైఁ
దలరెడిమానవుండె యొకతప్పున ముప్పన కగ్గమౌనఁగా,
కలగజరాజమార్గమున నట్టె చరింపక యుండుతాటియా
కులచెడుచిత్తముక్కులకుఁ గుంజరరాడ్భయ మేడ దర్భకా. ౭౧

ఉ. అవుర ! విచిత్ర, మెంతటియనార్య్యమొకో కలి; బ్రహ్మనక్త్రసం
భవులకునంట ! మల్కుల* యపాత్రపుఁగూఁతలు గీతలంట ! హా

(* రద్దీహింమానుండి.)

సీ॥ కోతిరూపంబైన పోతుహన్మంతునూ వేపార్ల దైవమని వేడుకొనిరి...
గొట్లందరూ "హరాహరా, బల్కరీ సుద్దగొట్లంత హరి పెద్దయనిరి,...

# విగ్రహారాధనము

శివశివ ! రామరామ ! హరి ! శిష్టవిగర్హితమైనమార్గముం
దవిలిన శిష్యునిన్ మనిచి ధర్మ్యపథమ్మునఁ బెట్టి ప్రోవరే.

ఉ. సారాచారవిచారదక్షమగు వంశమ్మందు జన్మించి ని
స్సారుల్ మక్కాలు వోవుమార్గముల నిచ్చల్ నించు నీచైదిచే
ధీరుల్ దూఱక యుందురే కటకటా ! "దీన్ మావ్రులా" వారికిన్
వీరల్ దాసులు, వారిబాస తుద కబ్బెన్ వీఁకి కంచున్ సుతా !

(లభించినమాయకీర్తికిన్ భంగమునచ్చె నీమహిమ పాడ్వడె)

చ. తిరుపతివేంకటేశ్వరుని దెవళ మూడినమీఁదఁగాని యీ
తిరుపతివేంకటేశునిప్రతిష్ఠకు భంగము లేమి తేలె; నెం
దఱు మలకల్ ప్రయత్నపడి త్రొవ్వివపిమ్మటఁగూడ దేవళా
లోరుగక నిల్చియున్నయవియో వినియుండవుగాక యర్భకా!

---

కొంటెలందరుగూడి కృష్ణు డనిరి... సీ॥ ...పంచితము వేడలే బహుశుద్ధి
కొని యిల్లువాకిళ్ళల్ల చల్లుకొనిరి,... భగవతాభక్తులు బాలగామానుకొని
హాపూజలే యిష్టమనిరి, మలమూత్రమే దోషములు తీర్చునసుకొని వేడ వుం
పంచితాలు తినిరి... శిలలు బొమ్మలు మిమ్ము రక్షించగలవా... సీ॥ పా
దేవిపై భస్మాసురుడు మోహించి దాని మెంగునని చంప తలచినాడు...౦
ముండల బోతును యీమున్రిదనక, కొల్వానలైనయ్యా అల్లాను క్రిమముగాను
సీ॥...గీ॥ భిడియపడరయ్యా దైవముకు ఝుడియరయ్యా, మడ్డిపూజలు యిఖి
మానివేసి, ...౧౯॥ సీ;... భాగవతమును బట్టి పలుగు కృష్ణుని చెరియ నిజమువ
తినయ్యా సుజనులారా,...౩౦॥ సీ॥ రామాయణము...కు భారతంబే బొంకు
భాగవతంబుపాల్గుమనుచు,... తే॥ ఇహములో యొక్క ఖురఅను హె
యాను మా, సత్యపురుషులు చెప్పిరీజగతియందు...॥ ౩౧ సీ॥... మొహమ్మద
దేవతులనైననూ... రాళ్ళనైనా, పూజించకూడదని బోధించి చెప్పినామాన
...॥ ౩౩॥ సీ॥ పడిపరా గ్రంథమే ఖురఆను ఘనమయా యితర గ్రంథము
లొషమసుంచి,...॥ ౩౯॥ సీ॥...గోమాంసములు మాకు గోమయంబేమీకు
మాకును పంచితాలు మీకు॥ ... ౪౨ ॥ సీ॥ ... గీ॥ శంకరా
చేసె మీ సంకరంబు, ... ౪౫॥ ... (మక్కా మక్కా నక

(ముంగలవారు...దైవ మటంచు నిన్ గొనియాడువార లవి నేఁటికి
బూటక మయ్యె)

ఎఱిఁగియు నోర్వలేనిజడు లెవ్వరొ ప్రేలినయంతమాత్రనే
“తిరుపతివేంకటేశ్వరు ప్రతిష్ఠకు భంగముగల్గె” నంచు నీ
వఱచె; దుపాంగమై జలధి యంతయుఁ గల్లనుకోకు మయ్యా! ది
క్కరిగతి నేమి యడ్డు భషకప్రకరప్రకటారవార్భటుల్ ! 75

అబ్బాయీ! నినువంటివాఁ డొకఁడు మర్యాదల్ దిగం ద్రావి యే
కబ్బంబో యొకఁడల్లినంత నది నిక్కంబై జగజ్జాలముల్
తబ్బిబ్బైనను బోనికీర్తి గలభూభృత్స్వామి కెగ్గౌనె ? యే
మబ్బా ! సూర్యుని బుగ్గిచే నడఁచు దేవయ్యల్ ధరన్ గల్గిరే. 76

ఆ. వె. అర్ధశతకమ్ము తుదకు సనర్థశతక
మగును సంప్రాప్తిఁ జెందిన యట్టికతన
నప్పుడునుగూడ నీజోలి కతఁడు రాఁడు,
భయపడక తక్కునగ మెట్లొ పాడు మబ్బ ! 77

తీతువుపిట్ట యభ్రము క్షితిం బడకుండఁగ నాఁగునంట ! విం
టే ? తనయా ! యటుల్ సుమి నగేశుయశంబది వోకయుంటకై
కైతయొకింత డాఁతునను గర్వపుఁ బ్రల్లదముల్; యథార్థమా
ఖ్యాతియ యేని దుర్జగుల కాఁకలు దాని నడంప నేర్చునే. 78

ఁ గలట్టిప్రౌఢిమం బందఱులోన మెచ్చుకొనునట్టి యుగకాలము సంభవించె)

ముందఱ మెచ్చు మెప్పులవి ముప్పులుగా నెఱుఁగం దగున్, యశం
‘బందఱు లోన మెచ్చుకొని’ నప్పుడయా; నెటువంటిపందయు
న్ముందఱ ‘షేల్ బళీ!’ యనియు, మో మటుతిప్పి ‘యపాత్రుఁ డీతనిన్
గంచుమయేని పాతకము గల్గు’ నటంచురుగాదె పుత్రికా !

చిందులు ద్రొక్కి ‘నేను గుఱుశేఖరుఁ దిట్టుట కిట్లు దేవతా
నిందకు బూనుకొంటి’ నన నీకడనే ‘సరిగా’ దటండ్రు పో
కొందఱు, కొందఱో, మొగముకొండొక ద్రిప్పినమీఁద నేమిగా
నంచురొ నీ వెఱింగినరహస్యమె నే వచియింప నేటికిన్. 80

## విగ్రహారాధనము

ఉ. మానసమే ప్రధాన మగు మానిసి; కందలిభక్తి భక్తి, యం
దూనినపూజ పూజ, యది యొప్పినమెచ్చది మెచ్చు, దానికిం
పైనది యింపు, దీనికి సమస్తజగమ్మును సమ్మతించు; నీ
మానసమేని యొప్పు; నది మాత్రము బ్రహ్మ సృజింపకుండెనే.

మ. మునుకొన్నాళ్లు త్రిశుద్ధిగా సతత మమ్మూర్తిన్ బ్రశంసించి నేఁ
డనిశమ్మున్ మదినెంచుచున్ బయిక నన్యాయమ్ములన్ గిల్కి యీ
యనయ మ్మేరికిఁ గట్టి పెట్టెదవె? నీయాంతర్య మట్లౌనుఁగా
కనఘుల్ తక్కినవారి కట్లగుట కేమత్యాహితం బర్భకా?

(నవ్యులు నీవు దైవత మన న్నగువారలు)

క. నవ్యుండు గాఁడె? శిష్టా, కవ్యాగ్రణి హనుమదాఖ్య గలబుధుఁ; డెటు
స్తవ్యునిగ వేంకటేశ్వరు, నవ్యయు నుతియించెఁ జెప్పు మర్భక! నాకున్

(1934 సం॥ ఫిబ్రవరి అభినవ సరస్వతినుండి)

# తిరుపతి వేంకటేశ్వర తత్త్వము.

చ. "తిరుపతి వేంకటేశ్వరుఁడు దేవుఁడు కాఁ"డని తిట్టుచున్న యా
పురుషుల పైకమున్ ముడుపుమూటలు కట్టునటుల్ పొనర్చి నీ
గిరి కరుదేర బుఱ్ఱగొఱిగించి వపంపడి చెప్పుదెబ్బ లే
త్తైఱ నపరాధశిక్షగ విధింతువు తిర్పతివేంకటేశ్వరా!

ఉ. నీమహిమంబెఱుంగని వినీతులు కొందఱు నిన్నుదూఱుచో
సామము చేతనో, భయరసంబుననో మరలించి వారికిం
గామిత మీఁగడంగెదవ కాని నిజంబుగ నీవ యాగ్గినన్
భూమిపులైన భస్మమయిపోరొకొ? తిర్పతి వేంకటేశ్వరా!

చ. ప్రణుతులొనర్చిరేని తులువల్ పొనరించెడి దుష్టచేష్టలం
గణనయొనర్పఁబోకుమి, యొకానొకఁ డట్టులొనర్చుకున్న స
ద్గుణరహితున్ సహింపకుమి, కోవిదు లేరును దాన నిన్ను దు
ర్గుణుఁడనఁబోవ, కీ పథ మెఱుంగుము తిర్పతి॥

ఉ. భక్తులయందు నీకుఁ గలపారములేని కృపారసంబు సం
రక్తియుఁ జూపు పొంటె నపరాధులనేరము వారినోట సా
హోక్తులచేత ముందు వినకున్న భయోక్తులచేతఁ బిమ్మటన్
వ్యక్తముఁజేసి మొక్కుబడు లందెదు తిర్పతి॥

అపమతి నీకుఁ జేసెదు దురాత్ములగర్వ మడంప నెల్లమా
నవులును బూనియుండు తరుణమ్మున నద్భరమేల నీకు? వా
స్తవమిది; నేనగల్గు నృపసత్తముఁ డెవ్వఁడయేని తాన శా
త్రవుల నడల్చ పూనికను దాల్చునె తిర్పతి॥

దైవమవైన నీయెడలఁ "దప్పులు గల్గు"నటంచుఁ బల్కు బ
ల్కాపలులైన వారిపయిఁ గారుణికత్వముఁ జూపఁబోకు మ
య్యా! విధిగానఁ జెప్పితిని, నాగ్రహమొందకుమయ్య! సేతకున్
సేవకులైన వారలు వచింపరె॥ తిర్పతి॥

ఎఱుఁగక నీప్రతాపము, సహింపక నీఘనగౌరవంబు, కా
ర్లఱచుచుఁ బత్రికాకళులనంపియు నీదు సుదర్శనస్ఫుర
త్తరళగవీపరంపరకుఁ దాళక చొచ్చిరి సూర్యమండలో
పరిపథమందు దైత్యకవిపక్షులు తిర్ప॥

దేవుని నిన్నుఁ దిట్టు దురదృష్టులు లేరొకొ మున్ను! దానిచే
నీ వహి తగ్గెనే? యిపు డనేకులు తావకదివ్యజంఘికా
పీవరకేశలేశమును పీఁకఁగలారె? భవత్ప్రతిష్ఠయుం
బోవుట యీజగంబు నశిపోవుట తిర్ప॥ 8

భావమునందుఁ జంచలతఁబాయఁగ దేవుని రాతియందు సం
భావన చేసినారు మును ప్రాజ్ఞులు, కాని నవీను లట్టి సం
భావనసేయఁజాలరఁట! భార్యయుఁ, దల్లియు నంచు భేదసం
భావన యెట్లు చేసెదరొ వారలు తిర్ప॥ 9

"గురువును దైవమున్ మనకుఁ గూడ" దటంచు వచించువారికిం
దిరుపతి వేంకటేశ్వరుఁడు దేవుఁడు కాఁడు, యథార్థవస్తు త
త్త్వరులగు వారికిన్ గలఁడు దైవము తిర్పతి వేంకటేశ్వరుం
డరమరలేక నీ వరయుమా యిది తిర్ప॥ 10

దేశికుఁడంచు నిన్ను వినుతించెడివారిపయిం గృపారసా
వేశముఁ జూపుమయ్య! యొకవెంబరగొట్టు నుతింపఁ డేని నీ
వాశకునిన్ సహించిన మహాత్ములు నవ్వుదు; రట్లుగాన నో
యీశుఁడ! తగ్గశిక్ష విధియింపుము తిర్ప॥ 11

# విగ్రహారాధనము

చ. తెలియక నీప్రతాపము, మదిందలపోయక నీమహత్త్వముం
బలువలు తిట్టి, నాపదలు వచ్చినవేళల నీపదాబ్జముల్
గొలిచెడునట్లు చేసి కడకున్ దరిఁజేరఁగఁదీసి వారలం
దలగొఱిగించి కొట్టు మిరుదొడలఁ దిర్ప॥

చ. యశమువహించుఁ దప్తవిధి నబ్బిన నీ ఘనముద్రిదాల్చుటం
బశువులుకూడ గోపతిసమాఖ్యవహించి చరించెడున్ నిరం
కుశగతి సంస్కరించు నలగోవులఁ గావున నేరు నీకృపా
పశులు మహత్త్వముం గననివారలు? తిర్ప॥

ఉ. నీయభిధానముద్రి గమనించెడుగోపతి కెవ్వఁడో సురా
పాయియొ, జారుఁడో, తులువ, పాపి, శఠాత్ముఁడు, శుంఠ ముక్కు
డో వ్వయఁ దలంచుఁగాక, యటువోయఁగశక్యమె? శక్యమే నిలం
జేయుల వారి నీవు నిరసింపవె తిర్ప॥

ఉ. పేరునునూరులేని పెఱవేల్పులనామము లుగ్గడించినన్
జేరెఁడుముష్టియుం దొరకఁ జెల్లదు గాని భవద్భటుండు నీ
పేరుపఠించుచున్ బయలువెళ్ళిన భుక్తికి లోటులేదు; నీ
పేరుమహత్త్వ మెంత వినిపింతును? దిర్ప॥

ఉ. ముంగలివారు నీచరణపూజయొనర్పకయున్నఁ దాసకాం
శంగొను రామకృష్ణులను సైతము పూజయొనర్పఁబోవు పా
రుం గలుగంగఁబోరుగద? రోయక వారిని గూడ నీవు నీ
బొంగు బుజానఁ బెట్టి కొనిపొమ్మికఁ దిర్ప॥

ఉ. నీపదముల్ భజించు నవనీతు లనేకులు చెల్వువచ్చి వా
రాపని మానిరంట! యిదియంతయు నిక్కమయేని పాప మా
పూపలు రామకృష్ణులకు బొంగుబుజంబునఁ బెట్టి త్రోవయుం
జూపుచుఁ బొమ్మ నీవరుగుచోటికిఁ దిర్ప॥

చ. “పరమును మీర లందఱు నుపాసన సేయుఁ” డటంచుఁ జెప్పి, “ఁ
ప్పరమువు నీవ” యంచనిన వ్యాసునిపై నికఁ గోపమేల? “క్రో
పరమున నీవుకా” వనుచు వాకొనువారల నొంచఁగా నిరం
తరముగుదీక్ష నెల్లప్పుడుఁ దాల్చెను తిర్ప॥

జ్ఞానవిహీన గోతి, యదిసైతము నీకథ వ్రాసె; నింక వి
జ్ఞానముగల్గుపూరుషులు మానుదురే? మఱి గోతికన్ననుం
జ్ఞానములేనిమర్త్యుఁడు రసాస్థలమం దెవఁడేనియున్నచో
వీనికిఁగూడ గాథ వినిపింతును దిర్ప ॥ 19

"వ్యాసుఁడు కాలజేరుఁ"డని వాకొను టెట్టిదో, "రామకృష్ణు ల
భ్యాసముచేసినారు సురపానము, జారత" యంట యే ముప
న్యాసమొ, "గంగిరె" ద్దని మహాత్ములు నిన్నను టట్టిదే; విప
ర్యాసముగాఁ దలంతురి జడు లయ్యది తిర్ప ॥ 20

కలవు రసప్రవాహము, లఖండఘనాగమశృంగగౌరవం
బులుఁ గల, వద్భుతాధికవిపోషణజాతమహాఫలంబులుం
గలవని యెంచి నీకలిమి గల్పిరి తిర్పతితోడ; దాని మూ
ర్ఖు లెఱుఁగలేక గుట్టు యనుకొందురు తిర్ప ॥ 21

కనఁబడుఁ జిత్రధాతువులు, గన్పడు సిద్ధపదంబులున్, సుదృ
గ్జనగణనీయవస్తువులుఁ గన్పడు, దృశ్యము లెల్లఁ దిర్పతిం
గనఁబడు బుద్ధిగల్గి సరిగా గుఱిగా గురుపాదసేవ సే
సిన యనఘాత్ములందఱకిఁ జిత్రము తిర్ప ॥ 22

"తిరుపతిఁబట్టి నీకుఁగల తేజ" మటంచును, "నిన్నుఁబట్టియే
తిరుపతి" కంచు మూర్ఖులు పదింబదిఁ దంత్రము లెన్నియేని యే
ర్పఱచినఁగాని మీర లవి పాటియొనర్పరు; బ్రహ్మచేఁత కె
వ్వరు ప్రతిసేయఁగాఁ గలుగువారలు? తిర్ప ॥ 23

"ఱాయియు ఉప్ప"యంచు నిను ఉప్వయొనర్చుచు, "నీకుఁ దేజముం
బోయె" నటంచుఁ జెప్పు నెఱమూర్ఖులు తిర్పతి గ్రామసింహముం
జేయఁగ నీకు గొప్ప మహనీయత గూర్తు; రెఱుంగరేమొ యీ
న్యాయము "రాత్రిభార్య పవ" లమ్మని తిర్ప ॥ 24

ఏగిరియందు నీవు వసియింతువొ, లీలలు చూపుచుందువో,
యాగిరి పల్లెయైన జను లంకురు తిర్పతియంచు, దానితో
యోగమె కాని యేటికి వియోగము నీకు ఘటించు? "ఓడినకా
యోగములేదు నీ" కనుట మూర్ఖత, తిర్ప ॥ 25

# విగ్రహారాధనము

చ. గురు వగునిన్నుఁ 'గా'వనుచుఁ గూయుటయే యొకతప్పు, దానిపై
గురువును బల్కరాని పలుకుల్ పలికించు టిఁకొక్కతప్పు, దు
స్తర మగుపాప మిప్పగిది సాఁకెకుఁ జేసెడివారికోస మే
నరకము క్రొత్త దేర్పఱచినాఁడవో! తిర్ప॥

చ. ఎవఁడు దశావతారముల నెత్తెనొ వాఁడవు నీవ, త్వత్కళా
భవులనికాదె వ్యాసుఁడు ప్రబంధములం దల రామకృష్ణపుం
గవుల నుతించు, టీవు నొక కంటను గన్గొనుచుంటఁ బీఠికా
భవనమునం బ్రతిష్ఠ కనుపట్టుట తిర్ప॥

ఉ. "దేవుఁడ" వంచు నీకు వినుతిం, బ్రణతిం బచరించువారెపో
కోవిదు, లట్టి కోవిదుల కోసమె నీవిభవంబు సర్వముం
గావలె నంచుఁ గోరుదువుకాని కటా! తెగనాడఁ జూతువే,
కావలులైన వార లది గానరు తిర్ప॥

ఉ. రాజిత రాజరాజనగరంబు లనేకములందుఁ జెంది తీ
వోజ మెయింబ్రతిష్ఠ, యది యుండఁగని, మ్మటు మెన్నఁ బొంది శ్రీ
రాజమహేంద్రిమందిరవరమ్ముల మిన్నగు పీఠికాపురీ
రాజమహేంద్రిమందిరవరంబునఁ దిర్ప॥

ఉ. ఎల్లరు "నీవ యాదిపతి వీత్రిజగంబుల" కంచు నిన్ను వే
నోళ్ల నుతింపుచుండఁగ, జనుల్ మఱికొందఱు "నీకు స్తోత్రమే
చెల్ల"దటంచు నిన్ను నిరసింపఁగసాగిరి, స్వామి! యేమి యీ
యల్లరి! పెట్టవీవు చెవినైనను దిర్ప॥

ఉ. కర్ణమునందుఁ బెట్ట పనికాదు సుమీ, వచియించు టింతగాఁ
బూర్ణముగాఁగ నించితివి ము; న్నదిచాలక యిప్డు తిర్గి వ్యా
కీర్ణత నొందుచుండిరి నికృష్టులు వారలు తృప్తిలేక; వి
ద్యార్ణవ! తృప్తిసేయఁదగదా? యికఁ దిర్ప॥

ఉ. సేమముగోరి తిర్పతి వసించి ప్రసన్నతఁదాల్చి సేవక
స్తోమసురద్రుమంబ వగుచున్ విలసిల్లెడి నిన్ను రామరా
మా! మహి నేరొ దూఱుదురఁ! టంతటి మాత్రన నీదు పక్కపై
రోమముగూడఁ బోదని యెఱుంగుము తిర్ప॥

కింకరులై భవత్సప మొగిం బచరించెడి భక్తకోటి కే
కొంకును జంకులేని కఱకుండన మొక్కఁడొసంగి, వైరితా
టంకవతీమనోహరనిటాలతటాలకకుంకుమప్రభా
పంకముఁ బాపుశక్తి నిడువాఁడవు తిర్ప ॥ ౩౩

"పంచినపేక్క నిన్ గొలుచు పార్థివు లజ్ఞు"లటంచు, "నీకు న
ర్థంబు లొసంగువార లపథంబునఁ బోయెడివార"లంచు నై
చ్యంబు ఘటింతు్రి పాలకునియందునఁ గొందఱు "తిన్నయింటి వా
సంబులు లెక్కపెట్టు" సరసం బిది తిర్ప॥ ౩౪

అకట గల్గి పిన్న, భవదంశసముద్భవులైన రామకృ
ష్ణాదుల కెందునైన జగమందున ముందు సపర్య చేసి యా
మీఁదను "నీవులే"వనఁగ మేకొనుదుర్మతు లుండ, రున్నచో
మోఁదకె యోగ్యులెల్లఁ బనిముట్టునఁ దిర్పతి ॥ ౩౫

నందలు వేలు పద్యము లవారిగ నిం బడఁ జిట్టుచుం గటా!
క్రిందను మీఁదుఁ గానక లిఖింతురు పత్రికలందుఁ గొందఱ; ఈ
చందముఁజూడ వారిది దొసంగని తోఁచదు, వారికట్టి శ
క్తిం దయసేసినట్టి తమదే యది, తిర్ప ॥ ౩౬

"దాసులు సేసినట్టి పలుతప్పులనైన సహింతు" వంచుఁ, "జే
సొమ్మిసినవాఁడపీ"వనుచు, మోరకులేగతి నిన్ను దూఱిన
రోసముఁ జెందకుండుట "విరుద్ధమటం" చెవరేనియన్న సే
చేసెడుకార్య మేమఱఁగఁ జెల్లదు తిర్ప ॥ ౩౭

శరణము నీమనోహరయశస్సరసీరుహవైరిమూర్తికిన్
శరణము నీమనోహరకనచ్ఛవిదంతురమూర్తికిన్, నమ
స్కరణము నీపదాంబుజయుగంబునకుంగయిమోడ్చుచుం బర
స్కరణము నీదుభక్తుల కొసంగెదఁ దిర్ప ॥ ౩౮

మంగళమయ్య నీదు మహిమంబున కాయలమేలుమంగకున్
మంగళమయ్య నీవు కడుమన్నత గూర్చిన యొమ్మెలాఁడికిన్
మంగళమయ్య నీగుడికి మంగళమయ్య భవద్భటాళికిన్
మంగళమయ్య నీ కొకనమస్కృతి తిర్ప ॥ ౩౯

# విగ్రహారాధనము

ఉ. సేమము నీకు, నీయనుఁగుశిష్యులకుం గుశలంబు, నీదువి
ద్యామహనీయపద్ధతి కనామయ, మార్జితసర్వదిక్తట
స్తోమనిరంకుశప్రబలసుందరకీర్తిలతానతాంగికిన్
సేమము, నీదుభక్తులకు సేమము తిర్ప ॥

ఉ. పాలకుఁ డాత్మకూరునరపాలుఁడు గ్రంథమువ్రాయఁజేసి యే
వేళను నీదునామము జపించుచు నిన్ను సదా భజించుచున్
గాలము వెళ్ళఁబుచ్చుచు సుఖంబుగ భోగములందుచుండె; ని
న్నొల్లి భజింప లోప మొక టుండునె? తిర్ప ॥

ఉ. "ఈవొక రాతిబొమ్మ" వని యెంతురుకాని నిజంబుగా మదిన్
భావనసేయుచో బయట వత్తువు దివ్యదఖండవైభవ
శ్రీవిజయస్వరూపమును జేకొని; మున్నొక పండితుండు నిన్
* దీవరపెట్టఁగాఁ దలుపు దీయవె తిర్ప ॥

ఉ. నీప్రతిబింబచిత్రము లనేకము లుండనియిండ్లు లేవు, నీ
సుప్రథితప్రబంధములు చూడనియోగ్యులు లేరు, వేల్పులన్
బ్రప్రథమంబు నీచరణపద్ధతికిం దల యూనివారు లే
రప్రతిమప్రభావ! జగమందునఁ దిర్ప ॥

ఉ. పూచిన మావిగున్న గతిఁబొల్చెడి నీఘనవజ్రకంచుక
శ్రీ చెలువారువిగ్రహము చెల్వు గనుంగొనలేక నోటికిన్
వోఁచినయట్లు ప్రేలుదురు ధూర్తులు; వారలపాపమేమొ సం
కోచములేక చెప్పు వినఁగోరెదఁ దిర్పతి॥

ఉ. చిత్రమునందు శిల్పులు రచించిన బొమ్మలు తల్లిదండ్రులున్
బుత్రులు మిత్రు లంచుఁ దలపోసెదు రిప్పటివారు దివ్యచా
రిత్రుని దేవు విగ్రహమునీతిగ భావనసేయలేరఁటే
చిత్రము వింటివే! మిగులఁ జిత్రము తిర్పతి॥

ఉ. రాజుల విగ్రహంబు గజరాజులపై నిడి యుత్సవంబులన్
బూజలు సేయు నిప్పటిజనుల్ గుడిలోఁగల వేల్పుబొమ్మకున్

---

*శ్లో॥ ఐశ్వర్యమదమత్తోఽసి మాం నజానాసి దుర్మతే
పత్రైః పరీక్షసే ప్రాప్తే మదధీనా తవస్థితిః॥

బూజరయొనర్పరాదనుట పోలదు; గావున నెప్పుడేనియుఁ
బూజలు విగ్రహంబులకుఁ బోలును దీ॥

తిట్టెడినోటికేని నిను "దేవుఁడ, దేవుఁడ!" యన్న తిట్టె గ
న్పట్టును గాని వేఱు గనుపట్టదు మార్గము; కాన నూరకే
పట్టి ప్రలాపముల్ పలుకువారల తిట్లఫలంబు వారినే
కొట్టెడు కాల మీవు కనుఁగొందువు తి॥

ఎప్పటినుండియో భువి వహింపుచునుంటివి కీర్తి, యెందఱో
కప్పము నిచ్చువార లధికంబుగఁ దాసకనామధారులై
యొప్పెడివారలెందఱో, యహో! యెటువంటివి నీయశఃప్రభల్!
"పెప్పె పెమెప్మెమే"లు పెకలింతురె? తి॥ 48

ఈవు నిజంబు దేవుఁడవయేని భవన్మహిమంబు సర్వభూ
మీవలయాలయంబులను మేటికనంబు వహించెనేని దు
ర్భవను లౌచు నిన్నుఁ జెడఁదిట్టినవారలమీఁదఁ జూపవో
దేవర! తీవసంబు నెనుదీయక తిర్పతివేంకటేశ్వరా. 49

ఇట్లు, శిష్టాహనుమచ్ఛాస్త్రి.

'తిరుపతివేంకటేశ్వరుఁడు దేవుఁడుకాఁ'డని నీవు, 'కాదు, దే
వర' యని నేను, "లేదు, పలుబండలలో నొకబండ" యంచు నీ,
వురక యిదేటిరోఁత! మను పొక్కుట నాస్తికునోరు నొక్కఁ శం
కరుఁ; డని *"నాస్తిషే" త్తెనెడి కావక దానిఁ బకింపు మచ్ఛకా. 53
(త్వత్కఖార్థముల్ శ్రావ్యములై విపశ్చితుల సంతస పెట్టవు)
*ఏమన నేర్తు, నేమనిన నేమగుదో క్కో? నృసింహభారతీ
స్వామి విపశ్చిదగ్రణియొ? జంతుసమానుఁడొ? యమ్మహాత్మునెం

*శ్లో॥ నాఽస్తి చే న్నాఽస్తి నోహాని, రస్తి చే న్నాఽస్తికోహతః.)

*శ్లో॥ శ్రీశేషశైల సునికేతన దివ్యమూర్తే, నారాయణాఽచ్యుత హరే నతొక్ష, లీలాకటాక్ష పరిరక్షితసర్వలోక, శ్రీవేంకటేశ మమ దేహి కరా ...శ్లో॥ తాపత్రయం హర విభో రభసాన్మురారే, సంరక్ష మాం హ సరసీరుహాక్ష, మచ్ఛిష్య మప్యనుదినం పరిరక్ష విష్ణో శ్రీవేం. ...

# విగ్రహారాధనము

తే. మునివంద్యు నీగుణఖనిన్ వినుతించె; విపత్పరంపరా
గాములొకో? "విపశ్చి" దధికారులు, కాఱు లివేల ప్రత్రికా.

(ప్రాజ్ఞులు నుతింపరు)

శా. ‡భారద్వాజుఁడు మ్రొక్కె, గౌతముఁడు సంభావించె, నాకశ్యపుం
డారాధించె, యజించె నత్రియును, విశ్వామిత్రుఁడర్చించె, స్వీ
కారించెన్ జమదగ్ని, తక్కుఋషియుం గావించె జోహారు; వం
దారుల్ సప్తఋషుల్ ప్రపన్నజనమందారుం డతం డర్భకా.

శా. *మార్కండేయు డెఱుంగఁడే మునిమణిన్; మారారిలింగార్చనో
దర్కుం డాతఁడు విగ్రహార్చకుఁడు కాలాభీలపాశావళీ
కార్కశ్యంబు తృణీకరించె నలసత్కార్కిష్ఠుఁ డాపుణ్యసం
పర్కన్ వేంకటనేతఁ గొల్చె నలఁతుల్ వాపోవ నేమయ్యెడున్

ఉ. ఉక్కునయందు సింగ మొకఁ డుద్భవమందుట నమ్మ దేని "ఆ
యొక్కడ దేవుఁ డెక్క" డను ‡నెగ్గులు బొగ్గు లగుం గుమార! లే
దొక్కటికూడ దేవునకు నుండఁగ రానిప్రదేశ, మందులో
నొక్కొకచోటు ముఖ్యమగు నుక్తికి ‡గీతలె సమ్మతించెడిన్.

ఉ. ఉక్కుననుండి, సత్పురుషయుక్తులనుండి, జలమ్ము నుండి, నల్
దిక్కులనుండి, పావనుల దేహమునుండి, స్వతఃప్రభూతముల్
ఋక్కులనుండి దేవుఁడు దుఃఖితులకై యవతార మెత్తు; దు
ర్వాక్కులె కాకయుండినఁ బురాణము లాగమపుందుకాణముల్.

క॥ గతిలేక తుదకు ‡"జీవ,న్మృత"మతమొకఁ డాశ్రయించి మితిమీఱి దు
ర్గతమొడిగట్టిన నినుఁగని, క్షితి వగవనియోగ్యు నొకనిఁ జెప్పంగలవే?

(తిర్పతి గ్రామ సింహము)

చ॥ తిరుపతి "గ్రామసింహ" మని తిన్నమ యెన్నరకున్; మకారమున్
మరుసుతనాఁ జేర్చితివి; నోరది పూర్తిగ *మూఁత వెట్టున

---

‡(సప్తర్షికృత-వేంకటేశ్వర శరణాగతి స్తోత్రము చూ.)

(* మార్కండేయ కృతవజ్రకవచము చూ.)

(‡ భగవద్గీతాదశమాధ్యాయము చూ.)

‡ శ్లో॥ య స్స్వధర్మాత్ పరిభ్రష్టో వృథైవ బహిష్కృతః, స జీవ
న్నేవాస్మిన్ మృత ఇత్యభిధీయతే॥ (విష్ణుపురాణవ్యాఖ్య

(* పకారస్యదన్తోష్ఠం, ఉపూపధ్మానీయానామోష్ఠౌ) (కౌముది

క్కరఁ; మగుఁగాక యేమి చెడుఁ? గారుణికత్వముకల్మి వేంకటే
శ్వరగురుపాదరక్ష యది సాఁగఁగఁజేయుత నో ర్వారింబొరిన్. 89

ఎందుకుఁ బోయితె దూర? కిఁక నేనియు నోటికి బుద్ధిఁ జెప్పికొ;
మ్మంటలు నీ మొగమ్ము గనినప్పుడు చేసెడిచేఁత యేమొ నే
నిందు లిఖింపనేల? యది యింతకుఁ బూర్వమె నీకు స్వానుభూ
తిం దెలియంగ వచ్చు; గురుదేవవినిందకు నైఁప నెవ్వరున్. 90

(వేఱురీతి నెపు డీశతకార్థము)

తనకపవాదలం బలికి తాండవ మాడుదుగాక యల్గఁడా
యన; నగుచుండు "వీఁడెవఁడురా!" యని, మున్నిటులాడి *తత్సని
ర్మనమున కగ్గమై శిరము సర్వము ముండితమైనమీఁద మొ
క్కినజడు లెందఱున్ గనఁ దకించనులన్ మనవెంకఁ డర్భకా! 91

(చందన మాచరించెదము)

చందన మాచరించెదరె! బాగది మంచియుపాయమే; విఘ్నం
దందిగొనందు వందనము లట్టివికాని యెఱుంగరేమి? యే
చందపు శిష్యముల్ మొగిచి సామి కెరంగుట యొప్పునో యటుల్
సందరిసించి చందనము సల్పుఁ డఘం బిడియొల్లఁ బొల్లగున్. 92

(భక్తితో నెంట్రుకలే నొసంగఁ గృప నెంచెదవు)

ఎవ్వని ‡రెండు వెండ్రుకలు కృష్ణుఁడు రాముఁడు కూడ నయ్యె న
ప్పువ్వులుకాని తండ్రికి "నమో" యనుపట్టున నెత్తినున్న యా
క్రొక్కు న్వాఁడుఁగావలెన్ గనుకఁ గొండుక ముండన మండనంబు; నే
విప్పవరం బెఱుంగమి నెఱే వదరం బోకొంటి వర్భకా. 93

(బోధములేనికాల మది పోయెను)

"బోధము లేనికాల మదిపోయె" నటంచు, నెవండు నమ్మి? స
ర్వాసనమైన యిక్కలికి నక్కట, బోధముకూడ నేడ! యె

---

(* వేంకటాచలమాహాత్మ్యము 2, 3 అధ్యాయములు చూ.)

(‡దేవీభాగవత చతుర్థస్కంధద్వావింశాధ్యాయము చూ.)

# విగ్రహారాధనము

గాథలయందు నీతనికి ‡ గణ్యత సున్న; ధనాద్యకుల్ మహా
సాధువు లిక్కలిస్థితికి సర్వధనంబుచుమీ కుమారకా.

మ॥ కృతగుర్వంఘ్ర్యభిషేకు, లుజ్ఝితకుధీశ్రీకుల్, బుతశ్లోకు, లా
దృతిపర్వాగమవాకు, లుత్తపితృమాతృప్రీతిసంధాకు, లూ
ర్జితసత్యప్రతిభాకు, లాచరితసుక్షేత్రైకయాత్రాకు లి
ప్పతితుండౌకలికిన్ విరోధులు సుమీ! భ్రష్టుల్ కదున్ బంగకుల్

శా. ఏకాలమ్మున పాపకార్యములనే యీతండు ప్రేరేచు, స్వ
శ్లోక మ్మన్నను, జన్న మన్నను, దరాయాధిన్ బ్రవర్తించువే
దైకదృష్టులు శిష్టులన్న నితఁ డత్యంతమ్ము ద్వేషించు, దు
ష్పాపుం డీకలి, వీనియాకృతియుఁ * బాపప్రాయ మోయర్భకా.

ఉ. ఆకృతిఁబట్టియే గుణము లబ్బెడి నంచును పెద్ద; లిట్టిభ్ర
ష్టాకృతి కెట్లు మంచిగుణ మబ్బెడి? ద్వాపర మేగె, నంత దు
ష్పాపుఁడు వీఁడు వచ్చెఁ; బరిభ్రాయ మెటో చనె, బాల్య మేగు ని
ద్దీకలి కెట్లు బోధ మవి యీతని కాలమునన్ జనించెడిన్?

ఉ. భారతమందుఁ జేర్కొనెడిపాతకులన్ బ్రథముండు మద్గుణా
శ్రీరమణుండు కౌరవకులేశయశీతకరుండు దుర్యశ
శ్చారి ‡ సుయోధనుం డితనిసారమె యేమనుకొంటివో! యెటుల్
గూరు సుబోధ మిక్కలికిఁ? గొండొకవృద్ధి ఘటిల్లు నెట్యోషన్.

చ. కలికలుషం బెఱుంగనియకాలపునెట్టు లబోధమున్ మదిం
దలఁతురు బోధ మంచు; విబుధప్రవరుల్ జడబుద్ధులైన య
య్యలఁతులఁ జూచి 'యక్కటకటా! కలినాసికి లోఁగి పీస త
ప్పల కెర యైరిగా!' యనుచుఁ బొక్కుదు రేమియుఁ జేయనేరకన్!

ఉ. వీనియనంతరమ్మునఁ బ్రవేశమగున్ † యుగరాజు వానిలోఁ
దానెగడున్ సుబోధము; కృతజ్ఞు లెఱుంగుదు రీరహస్య, మ-

---

(‡విష్ణు పురాణ షష్ఠాంశము చూ.)

(* శ్రీనాథనైషధ సప్తమాశ్వాసము కలివర్ణనము చూ.)

(‡ శ్లో॥ దుర్యోధనః కలేరంశః) (దేవీభాగ ౪ స్కం, ౨౨ ౬, చూ

(† విష్ణుపురాణ చతుర్థాంశము చూ)

# విగ్రహారాధనము

తొలి ధనాఢ్యులకెల్లఁ దలలోనినాల్కలై యెందు నాస్తికులు పెంపొందిరేఁ
మును ధనం బిడువారు ధనదాతలెల్లఁ “గళ్యాణంబు విధవానుయాయి” క
బ్రహ్మవిద్వేషసంబంధమాత్రమున ముక్తజనులెల్ల మ్రొక్కిక్క చెప్పనికి నేని
అంత్యజాచార్యమతావలంబనమును వెనుకటివారు గైకొనిరి తఱచు

గీ. ఇప్పుడును నట్టి యుత్సాహ మెల్లయెడల
వ్యాప్తిఁజెందెఁ జెందుచునుండె వ్యాప్తిఁజెందఁ
గలదు; సరిపెట్టుకొంద మిక్కలువ మిట్లు;
కాక శోకించి చేసెడికార్య మేమి.

(వేఱురీతి...నీదుభోగముల్...నమ్రత...నహింపఁగ)

చ. తిరుపతి భోగి, యగ్గిరిని దీప్తినెసంగెడిసామి భోగి, నీ
వరయక భోగముల్ గినిసి యాడఁ బొడంగితి "వేఱురీతి" నీ
*దురిత మడంగు శంకరునితో యజనేత్ర స్మరింపు మాపె పా
దరజము శ్రీవిరాజితము ధన్యునిఁ జేసినఁ జేయు నిన్నిఁకన్.

ఉ. బ్రహ్మమతంబు నిప్పటికిఁ బట్టితి, నాకడ నున్న యప్పు డ
య్యమ్మ ప్రసాదమే గతి యథార్థము చెప్పను? యాపెయాలయ
మ్మిమ్మగ నుండి మంత్రజప మేగతిఁ జేసితి విట్టినీవు? మొ
త్తమ్మున నిన్నుఁ బోలెడుకృతఘ్నుఁడు లేఁడు సుమీ జగమ్మునన్.

ఉ. భోగము, భోగి, భోగినులు వొాల్చెడి శంకరు నర్ధమూర్తి, యా
భాగిని మందభాగి నిను భక్తునిగాఁ దలపోసి సత్కళా
భోగిని గాన జ్ఞానలవభోగినిగా నొనరించె. నిప్పు డే
లాగున దూష్యమయ్యెను శిలాప్రతిమార్చన నాకుమారకా.

మ. భవితవ్యంబు నెఱుంగ నేరవు, భవత్పాపోదయం బిట్లు పం
డవలెం గావున వేంకటేశ కుఱఁడన్నా! * భోగినీరాగిణై
భువి నెందున్ వినుతింపఁగాఁ బడెడిఁ బక్షుండాతఁ డెంతొ గాయకా
కవి కీలాటినుహారరహస్యము తెలుంగన్ శక్యమె ట్లయ్యెడిన్.

---

( * శ్రీ భాగవత షష్ఠస్కంధము చూ. )

(‡వేంకటాచల మాహాత్మ్యము, ౧ ఆ, చూ.)

# గీరతము

మ. దురితం బీ వొడిఁగట్టినప్పుడు భవద్ద్రోహమ్ము సర్వమ్ము నే
నెఱుఁగం జాలిన యంతకట్టి నొడువన్ హేయమ్ముగాఁ జూడ నె
వ్వరు; నన్నైనఁ గృతఘ్నతాఘ మొకఁడే వాక్రుత్తు, నన్యాఘమో?
‡ పరకీయానననేయ, మూఁటిక వృథాభారమ్ము నాకేటికిన్? 111

ఉ. *గురుపిత్రమాతృదేవులతగుల్ వివరింపఁగ రాదు, భోగముల్
తిరుపతివేంకటేశ్వరుఁడు తేలనివాఁ డని కాదు, దాన నీ
గురుతకు భంగమేమి? యిదికొంకెతనంపుఁబ్రసంగ; "మేల కొ
బ్బరితరు వెక్కె" దన్నఁ "దృణభారముకోస" మటందువే సుతా? 112

ఉ. "తిరుపతివెంకటేశగురుదేవుఁడు 'భోగి' యటన్నఁ దప్పా? 'చి
త్తర మలవాఁడు దేవరా కృతఘ్నుఁ' డటన్నది తప్పా? సుంత నీ
వరయఁగలేకపోతి"వని యాడుదు రేకవనమ్ము చూచి; తె
త్తఱపడినాఁడ వెయ్యదియు దారి గనంబడకో యమాయికా 113

(నీపదములే భజియించెడివారుగూడ...మున్పటివలె నిన్నుఁ గొల్వరు)

ఉ. " 'తిరుపతి వేంకటేశ్వరుఁడు దేవుఁడు మా, న్నిపు డట్లుకాఁడు కొ
ల్వరు పలుమంది' యన్నదియె లాఘవమో? 'కృతము న్దలంపఁ డ
మ్మెట' కన లాఘవంబో? కనఁ బోఁడితఁ" డందురు లోకు; లెంత త
త్తఱపడినాఁడ వెయ్యదియు దారి గనంబడ కోయమాయికా. 114

"సుకృతము లెన్ని కృతఘ్నత, సరివచ్చెడి? దానిఁ బెంచసాఁగె నితఁడు వే:
మఱువాఁ" డందురు సుమి! త,త్తఱపడితివి దారియొండు దగులక పుత్రా.

తిరుపతివెంకటకవుల్ననుఁ, దెగఁ గించితి యాశము సుకిఁ గెనే? యింతటు, నె
వ్వారోతక్కఁ గీర్తిపదుచుం, దొరకదె తాపృశులు విబుధ ధూర్వహులెందున్.

మ. ఇదెగద, నీవు ...లిపము లెన్ని పఠించినఁ దేలు సారి? వి
చవువనఁ గొ...త్రాఁ జెడు యాశమ్ముది లేశము లేద; చాఁపరై,

---

‡ శా. చెల్లానెన్నికిఁ దసికట్టయితివా-డీ? మాట లింకేటికిన్ (ఈ పద్యపాఠ
రికవిత్వమో, కని ననసక్తికం గలసంగతి సందర్భము లెట్టివో మా శిష్యులు
రా॥ లే చెప్పవలయును గాన వలయువారు వారివలన నెఱుఁగఁదగు.)

*శ్లో. భవానీశంకరాదీనాం పితో ర్వా కేళివర్ణనమ్, (ఇత్యాదినిషేధప్ర
కార శేఖరాద్యాలంకారికగ్రంథేషు ద్రష్టవ్యః.)

# విగ్రహారాధనము

చదరయి నిల్చి యిప్పటికిఁ జాల దినమ్ములు వోవుదెంచె; ని
య్యాది గని యోర్వలేని జడుఁ లంతయునుండిన నెంతయేడ్తురో!

ఉ. కాఁపున నున్నకీరితికె కావలె బోలెఁడు చోటు, నీవు నిం
దేవిధినేనిఁ గొంత గొను మీఁగలఁ డాతఁడు; నీకొసంగఁగా
నావల నిల్చినట్టిదియె యాతనికిన్ సరి పోవు; మాసియే
పోవునొ? పోవనీ, యశమపో' గదుఁ గాఁటియ హేతు పర్భకా.

క. *తఱుఁగు నీకఁగీర్తి యనుకొని, పాఁఱఁబోరి లిఖియించి తీవు బూతులు;
శెరిఁగెడినని భయపడు నతఁ, డరసితివే హేతు? పర్భకా! యిప్పట్లన్

చ. మును హరిశాస్త్రిగారి నొకమోఁజకు, నీవల వేంకటేశ్వరున్
గనలి యవాచ్యముల్ గిలుకుకైవడి, నేవియొ వ్రేల దానికా
యన "జగమింత యుండ నను నాయలఘుం డటు దూఱుటే సువి
ఘునతకు నొప్పికొంట" యని కైకొనె మోదము నాఁగవింటివే.

సీ. భోగినీరతుఁడయ్యు, భోగినీరతుఁడయ్యు భోగినీరతుఁడై యప్పుణ్యమూ
విభ్రమద్గతియయ్యు, విధ్రమద్గతియయ్యు విభ్రమద్గతియై యవ్విశ్వమూ
ఆచలానుగతుఁడయ్యునచలానుగతుఁడయ్యునచలానుగతుఁడైయయ్యచలః
శృగ్గసద్గతుఁడయ్యు, శృగ్గసద్గతుఁడయ్యు శృగ్గసద్గతుఁడై యాజిష్ణుమూ

తే. గీ. సానుగతుఁడయ్యు, నతఁడు దాసానుగతుఁడె
వేశపరుఁడయ్యు, నాతఁ డావేశపరుఁడె
భీరహితుఁడయ్యు నాతఁ డాభీరహితుఁడె
ఏమెఱుఁగు దీనఁ గలభావ మెజ్జనుఁడు.

(మాసె భవత్ప్రతిష్ఠ యిదె మాయుచునున్నది మాసిపోవు)

చ అటమటి నేవియో గిలికి యంతన "పెపశీముండఁ బో దిఁకన్
విరుపతి" యంచు నెంచు భవదీయవివేకము "వార్ధి దోయిటన్
బురపురఁ దోడి లోఁగె" నని పొంగెడివానివిధమ్ము దెల్పె; సం
బరపఘు, మేల నీముదము శల్పన సేయువలెన్? గుమారకా!

---

* శ్లో॥ భాగ్యవన్తం ప్రసూయేథా, మాశూరం మాచపండితం, శూరాశ్చక
విద్యాశ్చ మమపుత్రావనంగతాః" (ఇతి ద్రౌపదీం ప్రతికుంత్యా

మాయను సూర్యుఁడున్, శశియు, మాయఁ జరాచరజంతుజాలముల్,
మాయను భూమియున్, దివియు, మాయను సప్తకులాచలమ్ములున్;
మాయని వస్తువేది ? వినుమాయది, తిర్పతివేంకటేశ్వర
శ్రీయఁ బ్రతిష్ఠయున్ మిగులఁ జేసెఁ దావయి పొల్చు నెప్పుడున్.

గీ. జగమఖిల మప్రతిష్ఠావశమున నుండు
నయ్యదనఁగూడ నచలమై యలరు శేష
* శయ్యపైఁ బొల్చు వేంకటేశ్వరప్రతిష్ఠ;
దాని మాయింప నొకరికిఁ దరమె పుత్రి! 124

(పోరక లేనిపోనికాళ్లంద్రు భవద్గుణం బెఱుఁగ నట్టిరు)

"కొందఱు తద్గుణం బెఱుక గూరక యూరక లేనిపోని కా
ళ్లందు" రటం చెఱుంగుదువ; యంతటియు యింతయు గాక పూర్తిగా
నెందుకు సర్వమున్ దెలిసి యేపుగా వలము లిఖించి గో
సం పెదవో ? కొఱుంగ నకటా ! వికటంబులు నీప్రచారముల్. 125

(నిక్కము వల్క సెపింతు వంచు)

అతఁడు "శపించు" నంచెఱుఁగు; దట్లగుటే ధ్రువ మేని మాఁడును
గతియు నెఱుంగు; దేమనుచుఁ గాఱులు నూఱెదొ, పెంకెకొయ్యవై !
యతని దయార్ద్రభావమక దా ? నిను నింతకుఁ దెచ్చె; నింక స
ద్గతి యిహమందు చేకొకటఁ గల్గుట కే తెరువో యి. పుత్రికా ? 126

గురువిద్వేషమె త్రోవయో ? యనృతవాక్యప్రీతత్వమే త్రోవయో ?
తిరుపత్కృతికృత్ప్రతికవిద్వేషిత్వమే త్రోవయో ?
చిరసంభాషణ వేదవిస్మృతము 'నిస్సీ' యంటయే త్రోవయో ?
పరమార్థమ్మన దేఁ చూచుకొని డంబాల్ గొట్టెదోయీ, సుతా ! 127
(తులువా తులువా యని నీవు...పల్కెద వన్యుల నాక్షేపించి)

ఎవరో నీదగుతుల్వ చెయ్వులకు నెంతే లోనఁ జింతించి నీ
యవివేకమ్ముప కొల్చి 'తుల్వ' యని నిన్నాక్షేపింతురున్ జేయ, నా
రి వచోధోరణి వేంకటేశ్వరుఁడు ప్రేరేపించిన ట్లెంచెదే
వలి వేకీ? యతఁ డేమి సేయునుర ! నీశుంఠత్వపర్యాప్తికిన్ ? 128

* దేవీభాగవతం 3 వ స్కంధము చూ.)

# విగ్రహారాధనము

ఉ. తా నొనరించుకర్మ మది తన్ను ఘటించి కలంచుపట్ల న
జ్ఞాని యిటేచుమీ, వృథగఁ జాల దురుక్తులు పల్కు దేవు; సు
జ్ఞానియొ కర్మముం దలఁచి, కష్టము నెట్టులొ సైఁచి, వచ్చుజ
న్మానకుఁ గూడఁబెట్టుకొనఁగా గమకించు సుకర్మపుంజముల్.

(ముష్టిచెంబుంగొని...బొంగు బుజానవేసికొనిపోదురు).

చ. "బొంగు బుజాన వైచికొని పోయినఁ" బోదురుగాక, "ముష్టిచెం
బుం గొనిపెట్టు" మంచడుగఁ బోయినఁ బోదురుగాక, "గంగిరె
ద్దుం గొని దేవుఁ డంచుఁ బలుత్రోవలఁ బోదురు"గాక; దేవనిం
దం, గురునింద సేయరుగదా! యలవారల కేల యగ్గిదో?

చ. శక్తుఁడవేని దేవగురుసంస్మరణం దిగఁద్రావి, ♦ పైనిక్ర
ష్టోక్తులు పేర్లు దుర్మదులయుల్లములం బగులింపు, ధర్మశా
స్త్రోక్తులు సమ్మతించు నిది; యారక తీరికకర్మ నేటి య
వ్యక్తత, బక్కదాసరుల కగ్గను నీసరులేమి కైసరా?

(బొంగుబుజాన వైచుకొని పొమ్మ్రఁకఁ దిర్పతివేంకటేశ్వరా)

ఉ. "బొంగు బుజాన వైచుకొని" పోఁడు; వరాంగముమీఁద నెక్కి
క్రంగికరావ ముప్పతిల "దద్ద దదిండక దద్దదోం దదోం
దొంగిణతక్క తక్క" యని తొల్లిటి కాళియమర్దనంబు జ్ఞ
ప్తిం గొలుపుం జుమీ, తుదకు వేంకటనేతపదారవిందముల్.

(మాసినమూవపేరుగళమండనము...నీవేసమునూడ నెవ్వరికివేడుక)

ఉ. దాసునివాసికిన్ సరిగ దైవము తత్తదుపాధిరూపముల్
భాసిలఁ జేయు; నీవు నగపట్టెను దేవునిగ్రీవ నక్కటా!
"మాసినమూవపేరు"; కనుమాయని వజ్రపుజోడు గల్గె శ్రీ
వాసుఁడు నీకుఁ గన్పడఁడు వాస్తవరూపముతోడఁ బుత్రికా.

చ. స్వామి ధరించు * వజ్రకవచమ్ము నెఱుంగుదె? యెన్నికోటు లా
నో? మహిపాలుఁ డెవ్వఁ డిడెనో? యటువంటి వివేకులెల్లరున్
బామరులా? దురుద్యములపద్ధతుల న్నిగడింప సొమ్ము వ
మ్మా? మఱియాడ కొప్పెడి ధరాధిపతుల్ సువివేకులా సుతా?

---

(♦ స్కాందోత్తరఖండము చూ.)

(* వేంకటాచలమహాత్మ్యము 5 అ, చూ.)

(శౌర్యము లేనివాఁడుగద శంకరుఁడు)

ఈశునకమ్మ కృష్ణుఁడయి యీశుఁడు పుత్త్రితయం బటుల్ హరి
న్నాశము సేసినాఁ డనుట నమ్మెడిచో నెటు "శౌర్యహీనుఁ"డన్
రాశికి రానిమాట జనరంజక మా? మదిలోన నర్ధనా
రీశుని బెట్టి వ్రాసితివొ యీనుడి; దానఁ గవిత్వభంగ మౌ. 135

"శౌర్యము లేనివాఁడుగద? శంకరుఁ" డంచొకబొంకు బొంకి, తే
యార్యులు విశ్వసింతు? "నిటలాక్షుఁడు శూరుఁడు గాఁ" డటన్న; నీ
ధైర్యమదేమొ? దేవసుతత్త్వముపట్టునఁగూడ బొంకులన్
గార్య మకార్యమున్ మఱచి క్రక్కెద, నెక్కడిపాప మక్కటా! 136

(నిం దిరుపతివేంకటేశుఁ డనఁ దీరదు తిర్పతివేంకటేశ్వరా)

"తిరుపతివేంకటేశుఁ డనఁ దీర" దటంచొకవాక్కు డొక్కపైఁ
"దిరుపతి వేంకటేశ" యని దీర్ఘము నేమని తీసితోయి? యే
మఱితొ? విడంబనమో? యది ప్రమోదమొ? హాస్యమొ? తప్పుమాపినా
నటిమఱేఁ బాచితమ్ముగఁ దదాహ్వయమున్ స్మరియించుటో సుతా! 137

(దాసరుల్ తిరిపము నెత్తువేళ నినుఁ దల్పఁగ)

తిరిపము నెత్తువార లొకతిర్పతివేంకటదేవుమాత్రమే
స్మరణ యొనర్ప; రొక్కొక రుమారమణున్, మఱి రాముఁ, గృష్ణునిం
స్మరణ యొనర్తు; రేటికివి సాఁగనికల్పన? లింతమాత్రనే
వరదుఁడు వేంకటేశ్వరుఁడు వైభవశూన్యుఁ డెటుల్ కుమారకా? 138

ఎంచి కనంగ లేదుకద? యెన్నఁడు నక్కట! * నారయప్పరా
వంచును "స్వామిసన్నిధి" యటంచును 'బైఠె' యటంచుఁ దంబురాఁ
గొం చరుదెంచుభిక్షుకులఁ, గొండొక రేని స్మరింపరేమి? య
య్యంచితువాసి గాసిలుట కానొకో? మానము లిట్టిగానముల్. 139

---

హిందూస్థానీ కీర్తన.

* అప్పారావు, దునియామే, నైరాజా, అప్పారావు స్వామిసన్నిధి
అప్పారావు వైకుంఠమే గై రాజా, అప్పారావు కాశీమేయిసుకటే
ఖానే లడ్డూ దియా, పీనే తంబాకు దియా, హాత్మే లకిడీ దియా, సోనే
దియా, దునియామే నై రాజా, అప్పారావు। ౧॥ పేనేలోక్కు రాజా,

## విగ్రహారాధనము

ఉ. ఎవ్వనిపేరు చెప్పికొన నించుక ముష్టియుఁగూడఁ బుట్ట దా
గవ్వ నెపండు పాడుఁ? ద్విజగమ్ములు మోసినవానిఁ దక్క; నీ
నవ్వున కర్థమేమి? యలనారయభూరమణుం డలంతిరామే ?
యెవ్వరు నీకుఁ జెప్పఁ గల? రేవియు పేర్లెదు తోఁచినట్టుగన్.

చ. అతని చరిత్రమున్ వినిన, నాస్యపుఁబాడిన, నాపవాన్య దా
తృతకు నమస్కరించినఁ, దదీయయశమ్ము పఠించు భిక్షుక
ప్రతతిపదస్ఫురద్ద్విజము ఫాలమునన్ ధరియించినన్ భవ
త్కృతము కృతఘ్నతాఘర మొగిన్ శమియించు,నటుల్ పొసఁగ్గవూ.

---

హుక్కా దియా రాజా, గుడ్గుడ్ దియా రాజా, చిల్మ్ దియా రాజా, గంజ
దియా రాజా, చిమ్టా దియా రాజా, దునియామే నై రాజా, అప్పారావు॥
బైఠ్నే చెత్తర్ దియా, సోనేకొ నత్తర్ దియా, యేలూర్మే, యేక్ బడా స
దియా, దునియామే నైరాజా, అప్పారావు॥ ౩॥ దూశ్మే ఛతీ దియా, పాంకు ?
దియా, సిర్కే టోపీ దియా, భద్నే ఘోడీ దియా, దునియామే నైరా
అప్పారావు॥ ౪॥ రోటీ ఖానేలోక్కు, రోటీ దియా రాజా, ధూ త్పినే
క్కు, ధూ, ద్దియా రాజా, దునియామే నైరాజా॥ ౫॥ బామణ్ లోక్కురా
ఏక్ సత్తర్ దియా, అగ్ని దియా రాజా, బైగణ్ దియా రాజా, డాల్, ది
రాజా, ఘీ, దియా రాజా, సీ, దియా రాజా, నమ్మక్ దియా రాజా,
యామే నై రాజా, అప్పారావు॥ ౬॥ కాశీరోట్టుదియా, జగన్నాథ్ రోట్టుది
మదరాస్ రోట్టుదియా, ప్రియాగ్ రోట్టుదియా, గయారోట్టుదియా, దునియ
నైరాజా. అప్పారావు స్వామిసన్నిధిబైఠే॥ ౭॥......శ్రీ.శ్రీ.శ్రీ.

(షరా:—ఈ మహాపురుషుని పుణ్యకార్యముల నిదేరీతిని బైరాగుల
గానము చేయుచుందురు. ఇయ్యనఘుఁడు సాక్షాద్భగవద్భక్తుఁడై జనులపా
భగవంతుఁడేయై యుక్తాయుక్తవిచక్షణత నెఱిఁగిన దాతయై నెగడెనఁట? ·
యుక్త దాతృత్వమునుగూర్చి యొక మహాకావ్యము వ్రాసినఁగాని యింతతో
నదికాదు. భస్త్రాహుతిప్రాయముగ సొమ్ము వమ్మొనరించు నేఁటిదాతల క
కీయనఘుని చరిత్రము నీతిగఱపఁగలదని యెంచి కొలఁది దినములలో నీ
రాయల పుణ్యచరిత్రమును వ్రాయనెంచి యిప్పటికి గ్రంథవిస్తరభీతిచే నిఁ
విరమించుచున్నాము.)

పతి వీడి వేఱొకప్రదేశముఁ జేరితివేని నీ, పరపతి యెంత యున్నదియో
పైఁబడుఁ దిర్పతి వేంకటేశ్వరా)

. తిరుపతి వీడి వేఱొకప్రదేశముఁ జేరిన వేంకటేశుఁ డే
పరపతి నుండెనో యెఱుఁగు వాంఛ జనించిన దేమి? చూడుమా
* కురుపతిపర్వతేశ్వరకు కొండొక యచ్చటనున్న వేంకటే
శ్వరు; మది సందియం బుడుగు, సంశయముండుట నష్టి పుత్రికా! 141

. కురుపతిపర్వతంబు గనుఁగొం టెటు లందువొ? యాత్మ కూర్పు ప్రభున్
బరిచితుఁ జేసికో, వ్యూతని పట్టణసీమకు నుత్తరమ్మునన్
బరఁగెడు నాగిరీంద్రి, మట భాసిలు వేంకటనేత, వాని న
న్నరపతి యింటివేలుపుగ నమ్మి భజించు ననేక భంగులన్. 142

. దేవబ్రాహ్మణభక్తిప్రో ప్రచటిపృథ్వీనాథుఁ, డెంతేని స
ద్భావుం, డాగమదేవదేశికులకుం దవన్ జేయువ్వారిఁ గ
న్నో వాంఛింపఁ డెఱుంగఁ జెప్పితిని నీకున్; వైష్ణవగ్రా
సేవాతత్పరుఁ డానృపాలుఁ గన జేజేఁ జూచినట్లుండెడిన్. 143

. సిరిఁ జెన్నారు మొగమ్మునన్ దిరుమణిన్ శ్రీచూర్ణముం బూని, శ్రీ
హరినామమ్ము జపించి, సాపకీ, యథార్థాలంకృతుల్ దాల్చి, భా
స్వరవిద్వత్కవిగాయకుల్ గొలువ నాస్థానమ్మునన్ బొల్చున
న్నరనాథున్ గనుఁగొన్న దేవగురునిందాపాపముల్ రూపఱున్. 144

. చేయఁ డపాత్రదానములు, చేయఁ డసర్వనమస్కృతుల్, మఱిం
జేయఁ డవైదికార్చనలు, చేయఁ డవిద్వదుదారసత్కృతుల్;
శ్రీయు యశంబు దాత్మలయఁ జేయఁ బొల్చెడివాఁడు, సత్కవి
శ్రేయుఁ డతండు, పండితవిధేయుఁ, డహాయః తెఱుంగఁ జెప్పితిన్. 145

. ఏగతివేని నీదుమత మెట్టిదొ కన్గొని, నీకుఁ గల్గు నా
గ్యాగరిమమ్ము తేల్చి, యుచితం బగుసత్కృతిఁ జేసి, మీఁద న
య్యాగమవేద్యుఁ డున్నగిరి కంపు సహాయుల నిచ్చి; యూరకే
వాఁగుటె కాని నీ కెటకు వాసిక పోవఁగ లే దెఱుంగుడున్. 146

* (ఆంధ్రకృత శ్రీనివాసవిలాసము ౧, ఆ, చూ.)

# విగ్రహారాధనము

మ. అసహాయమ్ముగఁ బోకు; మేఁగునెడ నయ్యావేశ్రింద్రమం దెంచు *వ్యా
ఘ్రిసమాజమ్ములు "గాంద్రు గాండ్రి" మనుచుం గర్జిల్లు నందెందు
బ్రహ్మసమాజంబులు నేసమాజములు సేమం బీయ; వీదోషముల్
పసి గట్టం గల వా మెకంబు లచటన్ భద్రింబు నూ పుత్రికా.

ఉ. భక్తు లనేకు లయ్యెడకు వచ్చుచుఁబోవుచు నుంద్రుః; వారిపై
రక్తిగ నుండు నంట యవి; బ్రహ్మసమాజము భక్తదూరమౌ
రిక్తమతమ్ము గానఁ జెలరేఁగఁగ వచ్చు శబ్దము నెంచి సు
వ్యక్తముఁ జేసితిన్ దగినయ ట్లిటకుం జని చూడు వెంకనన్.

. కుమతియని కుచ్ఛతియని, కురుమూర్తియు నాఁగ మతియుఁ గురూర్తియు:
బరఁగెడిగిరి యాది; యచటం గురుమూర్తియె నీకుఁదోఁచు గురువిభవముతో

చ. "తిరుపతి, వేంకటేశ్వరుని తేజమునన్ యశమందె" నంచు ము
న్నటిమటి వ్రాసి; తప్పుడేల నొకింత భిన్నము గాఁగ వ్రాసె; తే
మతితివో? బుద్ధి కిద్యడెనో? "మాడిగమంచపుఁ" గుక్కమో? యె
ఱుఁగఁగ రాదు; సంకరము లీవ్వు లెక్కించుచుడుల్ కుమారకా!

ఉ. తిరుపతివేంకటేశ్వరుల తీరది యట్టిదె! చంద్రికంచెరికా
స్ఫురణము భాస్వదాతపవిభూతి జ్వలజ్జ్వలనప్రభాభరం
ధరమును గా నెఱుంగుదురు ప్రజ్ఞులు; మోటముల్లో, యొకే యయుం
దిరిగెడి వారినాలుకలు తెగ్గును గావు సుమీ కుమారకా.

ఉ. అంబ నెఱుంగుదే? మహిషునాకడ మాఁగినతల్లి, యా పెసిం
గంబు నెఱుంగుదే? ప్రతిజగన్మయు భర్త మొనర్చె నేర్పె; నా
యంబయు సింగమున్ విడిగ నాక్రుతులన్ ప్రతిమాలి యున్నె?
వెంబరగొట్టు పోఁడుముల నేడబయు లెక్కియుంతు వేటికో.

కాసుల పూరుషోత్తముఁడు... శ్రీకకుళాంధ్రదేవుపైఁ జేసినయట్లు మేఁ
ఱచించితి మీశతకార్థము)

ఉ. కాసుల పూరుషోత్తముఁడు గట్టిన పద్దెము లెల్ల భక్తి కా
వాసము; లీవు గట్టెదవి బ్రహ్మసమాజసమాశ్రయత్వపుం

*వ్యాఘ్రిసభజ ఇతితు యుక్తం, తథాఽపీదం కేవలస్యాగ్రహమాత్రతత్
మానపరివర్తతఇతి కృత్వా సమాజ ఇత్యేవ ప్రయుక్తమితి తు రహస్యమ్

దోసము వెళ్ళఁగ్రక్కుటను దుండగపుం జెడుగంప, లద్దిరా
కాసులత్రోవ కూసులగు కాసుల కూరక దేవుఁ డిట్టెనే. 153

ఉ. కాసుల పూరుషోత్తముఁడు గట్టిన పద్దెములందు రామునిన్
రోసెను, గృష్ణుఁ గోసె, మఱి † రోయుఁడ తిర్పతి వేంకటేశుఁ; నీ
యాసునకున్ సహాయుఁ డతఁ డెట్లగు? వారల కీ వఛేదమున్
జేసెదొ? నీదుకృత్తులవి నీదుశిరస్థలి నెక్కి త్రొక్కెడిన్. 154

ఉ. "దేవునిఁ దిట్టరా" దనియె తెల్పెదనో? "గురుఁ దిట్టరా" దటం
చే వినిపింతునో? వృథయె యీయుపదేశములెల్ల నెంతదు
ర్భావుఁడు గూడ నీపను లపాత్రము లంచు నెఱుంగు; నట్టినా
నే వచియింప నేల? ఫల మెయ్యది కోరి యిటుల్ వొనర్చెదో. 155

ఉ. "నెట్టికి నేదినా ఫలము చేకుఱుఁ బోలు" నటన్న సామెతం
బట్టితినా? యధఃపతనభాగ్యము తప్పద; పట్టకుంటినా?
తిట్టెద వింతకన్న; నిను దేవుఁడె యిందుకుఁ బుట్టఁ జేసె; నే
నెట్టులు బాగుసేయఁ గల? నేమయినన్ వచియించుచుండెదన్. 156

(వివరించెద మింతకుమించి నీయపఖ్యాతిని దక్కు సామికాతకంబున)

ఉ. ఇంతకు మించి తిట్టఁగలవేమి! యహెట్టిదొ యింక నొక్కమా
ర్గం తదె కప్పుమా! భవదకుంఠితనీచతరప్రసంగవా
గ్గంభురతాప్రశస్తతరకాంతహృదంతరసౌమనస్యు
త్వంతతులే భవద్ధృదయసౌకరిపాకిఁ దులై చెలంగుతన్. 157

ఉ. ఈవఱకే "యథాతుఁ" లని యెల్లప ✦ మీనడి యెత్తికొంచు ని
ష్ఠీవనముల్ వొనర్చుగతి చేసితె నాఁగద? యింతకన్న న

---

అప్పనంబులు గొను నఖిలదిక్ప్రాంతశ్వరులచే వేంకటాచలస్వామి
దరుదుగా నఱువదాఱవసరంబుల మహాభోగంబుగొను నీలభూధవుడు
పానకంబాలుసాపాలు భక్తులకిచ్చి యొసఁగును మంగళాద్రీశ్వరుండు
పట్టికొలందిమై పూఁతగాఁగొను మంచిగంధంబు సింహాద్రిప్రభుండు

తే. గీ. సాటిసాములకీతి నిచ్చోట నీవు
మాత్రము త్యాగంబుఁ జూపక కీర్తిగలదె. చి॥

✦ (1) "ఈమధ్యను జూన్, జూలై, కవిత, సంచికలో మరల తిరుపతి
కవేశ్వరనిందలు గన్పట్టినవని వ్రాయుటకు దుఃఖించుచున్నవాఁడను వీరద్దర

ర్భావపు గూఁతలకే నదరి పాత్రిమికొనందగుభాగ్య మేమొ; పు
తాత్రి! వెఱ పేల? పండితపదస్సున కింముక వచ్చి తెల్పుమా!

---

కర్తలకు మఱి యెన్నఁటికిని బుద్ధిరానేరదని నాయభిప్రాయము..."
...యపురి, 1-9-13. K. S. Raghuramaswamy.

(2) చెట్టెక్కినవారింతతో శాంతిఁ బొందిన సరసముగానుండు ఇప్పటికే యపయశస్సు లెస్సగా వ్యాపించినది చేయుపని యెంతమేలు చేయుచున్నదో గమనించుకొను పరీక్షకూడ సామాన్యము కాదుగదా!
గుంటూరు, 2-8-14. శి॥ హ॥

(3) "నేను స్వగ్రామముప్రక్కకు వెళ్ళినప్పుడు వీరి యర్థశతక ప్రశంసను జెప్పఁగా యోగ్యులెల్లరిది యేమియన్యాయము... చదువుకొంటిరి లెమంతటఁ దామే యొప్పికొనియు నన్యాపదేశముగనో మఱియెట్లో యింక దెట్టి తిక్కనుబడుచు దర్భార్కులు దైవవంచితులగుచున్నారే' యనియే పసాగిరి, వారికి మనవిగఁ గొందఱుఁ వ్రాసికొంముమనియుఁ జెప్పిరి మొత్తమవీరి ప్రసక్తికి సంతసించువారులేరు. కాపథమున కెవరభిముఖులగుదురు?" శి॥

(4) శిష్యులు గురునిందాపరులైరని, తాము మందలించుచుండఁగా ప "అదేమి చూచెద విదిచూడు" మన్నట్లు కవితలో వేంకటేశ్వరునిఁ దిట్టి దితులు గొట్టసాగిరి. దేవా! పురాకృతపుణ్యవశమున నిట్టిశిష్యులు లభించినలకు ననుకొనవలెను గాని వేఱేముండును కానిండు సాధారణముగా ఖ్యాతి కల్గెడి యీయుగంబున మీగీరతధర్మసంహిత తద్దోషనివారకంబై ష్మహర్ష దాయకంబై వెలుంగుఁగాక. బృందావనము నరసింహాచార్యు

పొన్నూరుపోస్టు, గరికిపాడు, బాపట్లతాలూ

(1913 సం॥ సెప్టెంబరు 30 తేది మంగళవారముశశిలేఖనుండి)

శ్రీరామకృష్ణకవులు, విగ్రహారాధననిరసనము.

అనుచేర నేఁబదిపద్యముల రచించి తమ కవితారత్నముఁ బ్రకటించియున్న సంగతి పాఠకులంద ఱెఱింగినదే. వానిం జదివిన వివేకులకు శ్రీరామకృష్ణకవులు సర్వలోకగురు తిరుపతివేంకటేశ్వర పూజానిరసనరూపమునఁ దమ పితృవుల నెవ్వరినో దూషించుచున్నట్లు బోధపడకపోదు. అయినను వారి నామమునుబట్టియు వ్రాసిన టిప్పణమునుబట్టియు జనసామాన్యమునకు విగ్ర

ధన నిరసనమనియే తోఁచుటనిశ్చయము. కానఁ బామరజనాళిబాగును గోరియుం
ర్థయాపర్థ తేవిద్యా" అను నార్యోక్తిని దలంచి పండితులును గవిసత్తములును
ప శ్రీరామకృష్ణకవులతోడి ధర్మవివాదమువలన నాకు విద్యాభివృద్ధియగుననియు
మ్మ వారు రచించిన విగ్రహారాధన నిరసనము మాత్రమే యించుక నిరసింప
దలిడుచున్నవాఁడను గాన సదయహృదయులగు చదువరులిందలి యుచితాను
తముల నారయుదురుగాత....

శ్రు॥ 'దేవపితృకార్యాభ్యాం నప్రమదితవ్యం,' అనిశిక్షావల్లి, దేవపితృకార్య
ులవలన ప్రమాదము చెందకుము, అనియర్థము దేవకార్యమన దేవతాపూజ
ని మనము తలంచవలయును (పరాశరమాధవీయము 41వ పుటయందు) 'సంధ్యా
్నానం జపోహోమో దేవతానాంచ పూజనం' అని పరాశరుఁడు చెప్పియున్న
ఁడు; ఇందువలన దేవకార్యమన దేవతాపూజయని స్పష్టపడినది. దేవతలనేకులు
రు. మనమే దేవుని బూజింపవలెను? దేనియందుఁబూజింపవలెను? ఇదివఱకె
 పూజించిరి? అని ప్రశ్నలు కలుగకపోవు. వీనికన్నిటికిఁ బ్రత్యుత్తరములు
వు. వినుఁడు. "సర్వజ్ఞశ్చ హి మాధవః" అనిప్రాసికొనియున్న బ్ర॥ మాధవాచా
్యులవారు తమపరాశరమాధవీయమున 68వ పుటను అగ్నేయేపి, శ్లో॥ అర్చనం
ప్రవక్ష్యామివిష్ణోరమితతేజసః, యత్కృత్వా మునయస్సర్వే పరం నిర్వాణ
ప్నుయుః, ఇందుఁజేయవలసిన పూజ విష్ణుపూజయనియు విష్ణునారాధించి మును
ముక్తిని బొందిరనియుఁ దెలియవచ్చినదికదా? ఇఁక నీపూజనెందుగావింపవలె
 విషయముంగూర్చి ముచ్చటించుకొందము. పైశ్లోకము వెంటనే "అప్స్వగ్నౌ
ృదయే సూర్యేస్థండిలే ప్రతిమాసుచ, షట్స్వేతేషుహరే స్సమ్యగర్చనం ముని
స్మృతం......

ప్రత్యహం స్నాత్వా దేవర్షి పితృభ్య ఉదకదానం ప్రతిమావిషు హ
రాదిదేవపూజనం, ఇట్లు శ్రుతులు స్మృతులు పురాణములు విగ్రహారాధన
వింపుఁడనఁగా, మునులట్లుచేసి ముక్తిపొందఁగా, వది తెలిసి యాచరించి
ల్లూకభట్టమాధవవిద్యారణ్యాది వ్యాఖ్యాతృశిరోమణులు బోధించియుండఁగాఁ
తాళలోకము (అమెరికా) వఱకు వేళ్లు దిగివిగంతవ్యాప్తి నందియున్న యీ
గ్రహారాధన సాలవృక్షము శ్రీరామకృష్ణకవులవంటివారు చేయు నల్పవిమర్శన
ోపములయూఁపులకుఁ గదలునా? కదలదు. ఇంతియాఁకాదు. వీరి బోధలచే
జులవలనను బండితపామరులవలనను నిరంతరము పూజలు గైకొనుచును

శా. కీర్తి వసంతసేన, యది కేవలముక్ గుణరక్తి దానికై
యార్తి శకారుఁ డూని యది యాత్మ వరించిన చారుదత్తునిన్
ధూర్తుఁడు తిట్టితిట్టి యల తొయ్యలిఁ జంపఁగడంగి యయ్యస
ద్వర్తనుఁ డేమి దా మిడికెఁ? దద్గతి నీకుచితంబె పుత్రకా! 1

(ప్రిజల్ పరమేశ్వరుఁ గొల్వ నేర్చి యీ వెంగలి రాతిబొమ్మలను వేఁడరు)

చ. "పరుఁ డొకఁడున్నవాఁ" డనిన భాగ్యము లేదుసుమీ, కుమార! య
ప్పరువికృతుల్ గుకుండు మఱి పార్థివుఁడుక్ జనకుండు; నిందు నొ
క్కరుఁ డిగఁ ద్రావినక్ బరుని "గా" దని యంటయె; వేదశాస్త్రముల్
మెఱ లిడు నిట్లు; దాని నొకమోఱకు 'గా' దనినంత నే మగుక్. 2

(1) బ్రహ్మముఁ గొల్వ దైవవిశ్వాసము లేదు వీరికని ...దూఱెద వేమి)

చ. పరుఁ డన నెవ్వఁడో తెలియు భాగ్యము లేకయె పోవుఁ గాక, త
త్పరుఁడయి పెద్దలం గొలుచు భవ్యుఁడు భవ్యము లందఁగల్గు; న
న్నరునకు విగ్రహమ్మె సెడ, నాయనపట్టున, నమ్మచోట, భూ
వరుకడ, నొజ్జచాయఁ గనుపట్టుఁ బరాత్పరుఁ డేకరూపియై. 3

(జీసనుక్రీస్తునుం బ్రతిమ సేవను రోసెను)

మ. పరుఁ డెవ్వారికి లేఁడు? బౌద్ధులకు, నవ్వారే నియుక్ దేశికా
దరముక్ వీడరు; క్రైస్తవాదులకు నిత్యధ్యేయుఁడే యొజ్జ; యె
వ్వరికిక్ దూరమె నీమతం బెచటఁ సంపాదించి తో తండ్రి? నా
తరమే నిన్ను మరల్ప? వర్ధిలుము శీతజ్యోతిచంద్రమ్మునక్.

---

(2) తిరుపతి వేంకటేశ్వరుల ప్రజలకు లోటు వాటిల్లునా? వాటిల్లదు. "స
త్యమేవ జయతి నానృతం." (ఇందు విస్తరభీతిచేఁ జాలవదలితిమి) తి॥ వెం॥

ఇట్లు విన్నవించువాఁడు మహబూబు కాలేజి సహాయాంధ్రోపాధ్యాయ

విభ్రాజి. శివానుగ్రహవిరాజి

శివపురపు వీరభద్రపాకయాజి.

సనాతన ధర్మబోధినీ సామాజికుఁడు, శికిందాబాదు.

(1) ఈగుణుతుగల వాక్యము, వేంకటేశ్వరస్వామివారికి సమన్వ
యు. స్వామివారు బ్రహ్మముగొల్చువారల నెవ్వరిని దూఱిరి? ప్రమాణమే
ర్పైనెన్నో కలవు. మఱియొకటి మాత్రము చూపుచున్నారము చ. పరు

కల్పమ్మందును నీ వొనర్చుపని యేకష్టుండు గావింపఁ; డీ
ల్పం జేగురునొద్ద నేర్చి తరఁచే? శిష్యా, స్వయంవ్యక్తమౌ! 176

"వేదులవాఁడు నామఱఁది వేఁగుఁబ్రాఁతలు వ్రాసినాఁడు వాఁ
డీదురితమ్మునన్ జెడెడి నే నఘ మొంద" నటంచు నెంచెదే
మో? దురితంబు వాసి దనఁ బోలదు నీకయి వాఁడు వ్రేలుటన్
నీదియె పాతకంబు మహనీయుల వేత్తల నడ్గి చూడుమా. 177

గొల్లది చల్లలోఁ గలుపుఁ గొంపకుఁ గొంపకుఁగూడ నీళ్లు, లే
పల్లవపాణి యేనియు "సెబా! సిది యేమె యపాత్రురాల? యీ
చల్లకుఁ దెల్పు చచ్చె" నన, జాన వృథా జల మిచ్చినట్టియా
తల్లులఁ దిట్టు "నేచెనఁటి తా నిట నీరిడె" నం చెఱుంగుదే. 178

నేల తిట్టితన, మా, గురువే యిటు చెప్పెనంచు గొణుఁగకుమా! యీ
తమ్మెల్లను మెల్లనూ, పరి నాశిర మెక్కు మిగుల బహు విడి తనయా. 179

(త్ప్రతిమారాధనము నిరసించినచోఁ (బ్రధాననిబర్హణన్యాయమునఁ
దక్షిణ విగ్రహముల పూజయు నిరస్తము)

తిట్టఁగ లేదు నీవు మముఁ, దిర్పతివేంకటనాథునే చెడం
దిట్టితి విగ్రహార్చనవిధి న్నిరసించుట, కైనఁ గాశికా
పట్టణనేత దిట్టుటకుఁ బాల్పడ వే? మతఁ డగ్రగణ్యుఁ డా
దట్టునిఁ దిట్టినప్పుడ "ప్రధాననిబర్హణ" నీతి సార్థమా. 180

'శ్యత' ఇతి వివరణమునఁ, గాశ్యపి చనుఁగాక శూలకలితం బగుచున్
శ్య మగుఁ గాశి యది "య, ద్దృశ్యం తన్నశ్య" మనువిధికి లోఁగదుసూ.

(కలౌ వేంకటనాయక, అను వచనము)

'గలౌ వేంకట' యను, మాన మ్ముండినను గాశి మహిమ మధిక మె
యు నెట్లట్లగుటఁ 'బ్రధాననిబర్హణత' కదియ తగుఁ జమి పుత్రా.
క్రమములలోనఁ గాశీ, క్షేత్ర మ్ముత్తమము దానిఁ జెఱచినపై నే
క్షేత్రమ్మునేనిఁ జెఱుచుట, పాత్ర మ్మద్దాని విడువఁ బాడియె కుఱ్ఱా. 183

ండఱు కాశి కేగుదురొ, యెందఱు తిర్పతిఁ జూడఁ బోదురో?
దుమకాదె? సర్వపృథివీస్థలి క్షేత్రములెల్లఁ గాశితో

వైధాత్రశీర్షంబు ♦ వడిఁదుంచి గళహార
మందుఁ జేర్చి ధరించి♦నట్టికతన
అతులితజ్ఞానమో♦క్షాధికారియయి తా
నవ్వి భక్తుల కిచ్చు♦నట్టికతన
తే-గీ॥ అష్టమూర్తియై సర్వాజ్ఞ ♦ జాండవితతి
నిండి యొకఁడుప్రకాశించు♦చుండుకతన
పశుపతియె సర్వదైవత♦ప్రకరమునను
బ్రముఖుఁడని నిశ్చయంబుగఁ♦బలుకవలయు॥

వ॥ ఇప్పగిదిఁ జెప్పి చతుర్థసోపానం బెక్కె.

*****తే-గీ॥ స్వార్థతనుభూతహరి♦యు క్తుఁ♦డగుటకతన
అలవిశిష్టైక్యమున ముఖ్యు♦డగుటకతన
పశుపతియె సర్వదైవత♦ప్రకరమందు
నధికుగాఁదలపోయుదు♦నాత్మమందు॥

వ॥ ఇట్లు నిర్ణయించి పంచమసోపానం బెక్కె.

---

***శ్లో॥ భూమౌ లోకై రనేకై స్సతతవిరచితారాధితత్వా దమా
మస్తైశ్వర్యప్రదానా న్నిఖిలజగదుపాదానభూతాధికత్వా
హంసక్రోడాంగధారిద్రుహిణమురహరాద్యృష్టశీర్షాంఘ్రిక
జన్మధ్వంసాద్యభావా దపిచ పశుపతి స్సర్వదేవప్రకృష్టః
**,,*శ్లో॥ వారాణస్యాంచ పారాశరినియతభుజస్తంభనా త్ప్రోక్ష
ప్రధ్వంసే కేశవేన శ్రితనిజవపుషా ధారితత్వాత్మతలత్వా
అస్తోకబ్రహ్మశీర్షాస్థ్యనిశకృతగళాలంక్రియాభూషితత్వా
ద్దానాత్ ప్రజ్ఞానముక్త్యో రపిచ పశుపతిస్సర్వదేవప్రక
***** శ్లో॥ వైశిష్ట్యే యోనిపీఠాయితనరకరిపుశ్లిష్టభావేన శంభో
స్స్వస్యైకార్థప్రతీకాయితహరివపుషా లింగితత్వేన యః
అప్రధాన్యా ద్విశిష్టాద్వయ సమధిగమే దానవానాప
శంభోఃప్రాధాన్యయోగా దపిచ పశుపతిస్సర్వదేవప

# హరదత విజయము

ఋతమును సత్యము పరమును
వితతబ్రహ్మమును గృష్ణ♦పింగళ ముర్ధ్వ
స్థితరేత మయి విరూపా
క్షిత విశ్వాకృతిం బురుషతం ♦ గనుదీవు శివా!

ఇట్లు వక్కాణించి యాఱవమెట్టెక్కె.

భూతకాలమునందలి ♦ భువనమును వి
చిత్రముగ బహుజాతమై ♦ చెలఁగునద్ది
జాయమానంబునగునద్ది ♦ సర్వ మితఁడె
రుద్రుఁ డాతనికిదె జోత ♦ రూఢిగాను॥

ఇల రుదంద్రావయతి యను♦నిద్ధపద్ధ
తిని సకలదుఃఖములనెల్లఁ ♦ ద్రెంపువాఁడ
గుటను రుద్రుఁడనంబడె ♦ నిటలలోచ
నుఁడు మహాదేవుఁడెందు ఘ♦నుం డరయఁగ॥

ఇట్లు స్పష్టికరించి నిర్వచించి సప్తమసోపానం బధిరోహించె.

శివు నద్వైతుఁ జతుర్థుని
గవివరులు దలంతు రెందుఁ♦గౌశల్యమునన్
భవుఁడతఁడాత్మమతండెక ద
విజ్ఞేయుఁడును వేది♦తవ్యుండు నీకన్॥

అని ప్రకటించి యష్టమసోపానం బెక్కె.

అమరిక “శబ్దాదేవ
ప్రమిత” యనెడుసూత్రమున శి♦వా! తావకశ
బ్దమయిన “ఈశాన” యనుప
రమశబ్దముచేత నాత్మ♦ప్రకటితమయ్యెన్॥

---

పలగురోః కాళిదాసస్య విక్రమోర్వశీయనాటకనాందీశ్లోకే
హాంతేషు యమాహు రేకనిలయం వ్యాప్యస్థితం రోదసీ
స్మిన్నీశ్వర ఇత్యనన్యవిషయశ్శబ్దో యథార్థాక్షరః

చతుర్థాశ్వాసము

తే-గీ॥ అట్టిఈశ్వరేశాన♦యనెడుశబ్ద
ములనన్యవిషయములై ♦పూన్కి-నిన్నె
వాకొను యథార్థముగనంచుఁ♦బ్రౌఢబుధులు
కవిగురుల్గొనియాడిరి ♦ ఘనతయలర॥

వ॥ ఇట్లు ప్రతిపాదించి నవమసోపానంబెక్కె-.

సీ॥ అంతరక్షికరణ♦మందు "తద్ధర్మోవ
దేశా"దనుచు విశ♦దీకరించు
టరయ "యఏషోంత♦రాదిత్య"యను ఋక్కు-
నందు "యఏషోంత♦రక్షిణి"య
నెడుఋక్కు-నందు మ♦హేశధర్మము లుప
దిష్టంబులగుట నా♦దిత్యమండ
లాంతర్గతుండును ♦ నక్షిస్థపురుషుఁడు
హరుఁడని విస్పష్ట♦మయ్యె నమ్మ
తే-గీ॥ హోపనిషదుక్తి శేషులును ♦ ద్యుమణిమండ
లము ననువదించి తన్మండ♦లగతపురుషు
శివునిగ "నమోహిరణ్య"యం♦చు విశదముగఁ
జెప్పె నుపబృంహణంబులు ♦ చెప్పె నిట్లు॥

వ॥ ఇట్లు నిబంధించి దశమసోపానంబెక్కె-.

---

ఛాందోగ్యోపనిషది అథ యఏషోంతరాదిత్యే హిరణ్మయః
దృశ్యతే స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదితః-
అథ య ఏషోంతరక్షిణి పురుషో దృశ్యతే.........ఋక్సా
క్థం తద్యజు స్తద్బ్రహ్మ......ఇత్యాది-
మహానారాయణోపనిషది ద్వాదశానువాకే ఆదిత్యో వా
న్మండలంతపతి......య ఏషోంతరాదిత్యే హిరణ్మయః
ఇత్యనేనాదౌ ప్రభాకరమండలం నిర్దిశ్య తతోస్మిన్ మండ
ముపదిశ్య తదర్చిషి ప్రభాకరం ప్రదర్శ్య త్రితయస్యైతస్య ఋ
యజూరూపత్వంచ తన్మండలత్వం తల్లోకత్వంచ నిరూప్య
త్రయీమండలరూపే ఆదిత్యేఅంతర్యామిణం హిరణ్యపురుష
త్వ "ఏష భూతానా మధిపతి"రితి తస్యభూతాధిపత్యం చ

ధ్యానయోగ్యుఁ డవన్న ♦ త్ర్లోకికఖిలలో
కావన! మునినిచ ♦ యంబు సాక్షి
మోక్షప్రదాతవఁ ♦ భూరికీర్తికిఁ గృపా
మండితాత్మక! శుక ♦ మౌని సాక్షి
పూజనీయుఁడవన్న ♦ పుణ్యసూక్తికి లోక
శంకర! వేదపుం ♦ జంబు సాక్షి
భక్తహింసకవధ ♦ ప్రౌఢుఁడవనునుడి
కాపదుద్ధారక! యముఁడు సాక్షి

ంత్యుఁడవు నీవనుట కీశ! ♦ నీరజభవ
సస్తకోత్కరహారముల్ ♦ మహితసాక్షి
ఁక నవాద్యందమూర్తివఁ ♦ ప్రకటనమున
ాక్షులీ పద్మగర్భప ♦ ద్మాక్షులభవ!

ఇట్లు సేవించి యేకాదశసోపానం బెక్కె.

---

దనేన (ఉపాసనయా) తత్సాయుజ్యలబ్ధి రుపదిష్టా॥ ఉత్తరాను
ష్వపి "ఓం నమో హిరణ్యబాహవే హిరణ్యరూపాయ......
మే నమోనమః" ఇతి తస్యైవ హిరణ్యపురుషస్య శివస్య అంబికా
పఇత్యాది విశేషణద్వారావిభూతిరభివర్ణితా॥
ాయనోపబృంహితోక్తౌ-
డలాంతరగతం హిరణ్మయం భ్రాజమానవపుషం శుచిస్మితం
దీధితి మఖండవిగ్రహం చింతయేన్మునిసహస్రసేవితం-
ాతపోక్తౌ శ్లో॥ సౌరమండలమధ్యస్థం సాంబం సంసారభేషజం నీలగ్రీ
రూపాక్షం నమామి శివ మవ్యయం॥ ఇతి-
నభట్టపాదోక్తౌ-శ్లో॥ ధ్యేయత్వే తవ సాక్షిణో మునిగణా మోక్ష
నే శుకః
ద్యత్వే నిగమాః స్వభక్తవినతక్లాంతౌ కృతాంతాదయః
త్వే చ పితామహస్య చ శిరస్రగ్బృంద మాద్యంతయోశ్శూన్యత్వ
వరాహహంసవపుషౌ పద్మాక్షపద్మాసనౌ॥

## చతుర్థాశ్వాసము

వ॥ ఇట్లు దక్షిణమెట్టులందుఁగూడ దేవతాంతరత్వ నిరూపించుపద్యంబులఁజదువుచుఁ గడుసులభంబుగ నచ్చటిచివరమెట్టుంజేరి.

ఇందుకలావృత్తము— బాలునిపైఁ గృపఁ ♦ బఱపు మహేశా
బాలకలానిధి♦పరివృతకేశా!
పాలనసేయుము ♦ వసనకృతాశా!
లీల యిదా వికలితయమపాశా!

వ॥ ఇట్లు వేడి యద్దానిఁగూడ నధిరోహించి.

తే–గీ॥ జ్వలితనిశ్రేణిసోపాన♦జాల మిట్టు
సుంతశ్రమ లేక యే కడు♦వింత నెక్కి
యగ్రభాగంబుఁ జేరుడు ♦ నాకసంబు
నందు "శివఏవకేవల" ♦ యంచు మ్రోసె॥

తే–గీ॥ ఆప్రకారముఁ గని విని ♦ యఖిలజనము
లెంతయేని ప్రపత్తిమై ♦ సంతసించి
హర మహాదేవ శంభో మ♦హాత్మ!యని స్మ
రించి హరదత్తు మిగుల నుతించిరపుడు॥

క॥ అటుఁగని వైష్ణవులెల్లరుఁ
బటుభయమును జెందివేగఁ♦బఱుగిడి రింకన్
గటకట పెట్టకయేయం
తటవారల విడిచెను హర♦దత్తబుధుఁ డటన్॥

వ॥ అంతఁ జోళమహీంద్రుం డత్యాశ్చర్యపరీతచేతస్కుఁ దద్భూతశివభక్తిప్రేరితుండై ధరణీతలంబున సాగిలంబడి నిట్లు ప్రార్థించె.

—: చోళరాజు శైవదీక్షను జెందుట :—

ఉ॥ రమ్ము మహాత్మ!నీపదప♦రాగలవమ్మును నీనృపాలమా
ర్గమ్మునఁ జేర్చిపంకముఁబ♦రాస్తమొనర్చి వరేణ్యాగణ్యపు

మ్మగు శైవదీక్షను సమంచితరీతి ననుగ్రహింపు! హ
స్మ ఘటింపు నింపును ధరాస్థలి నెల్లెడ శాంభవోన్నతిన్॥

యర్థించిననంత శైవబుధుఁ డాహ్లాదంబుతో నెట్టులె
నొ మెల్లల నుగ్రహణంబు సలిపెన్ గీర్వాణప్రకారంబునన్
నాథుండు తదంఘ్రియుగ్మమున శీర్షం బుంచి సేవించెఁ ద
నవిద్వద్వరు లెల్ల మ్రొక్కి నుతులన్ గీర్తించి రత్యున్నతిన్॥

పజేశ్వరుఁ డర్థింపుడు
మఁ డా హారదత్తగురుఁడు గౌరీశ్వరదీ
ప నొసఁగి శర్వలింగం
ము ధారణముఁ జొనర్చె భూవరున కొగిన్॥

ంటనె రాజసభన్
వమనీషిప్రవరులు సభ్యు లగునటుల్
ంచెను శివధర్మము
కేళను సలుపునట్టు లేర్పఱచె రహిన్॥

ంతి హారదత్తునిఁ దదంబ నపరిమితమ
పరణి గౌరవించి తదాత్మ మెఱిఁగి
మెలంగుచు వారి నిశ్చాంతభక్తి
డ సేవించుచుండె సంతుష్టమతిని॥

రదేశము లేగి యందు చిరవాస
న్నశైవులు మరలఁజొచ్చ్చి శాంభ
భ్యుదయ మాలకించి మహాప్రమోద
ంది చేరిరి కాంచికి నుత్సుకతను॥

కంచినున్న విష్ణుచిత్తాచార్య
యు లిరువురు హారదత్తధీరుఁ
త్మభాగినేయుఁ డగుట నెఱింగి యే
ంతమందు నతనిఁ గదిసియనిరి॥

హ్మకీనసహోదరీసుతుఁడ వన్యాప్రాప్తసామర్థ్యాల
[illegible] ర! రము హారికాంచీ క్షేత్ర మస్మద్భ్రాశా

## చతుర్థాశ్వాసము

పన్నగారాధిగతాపచారమును భా♦వంబందు మన్నింపు వి
ష్వక్సేనాంశము నుద్ధరింపుము! జగం ♦ బత్యంతమున్ బే

క॥ వినుము సుదర్శనగతి నీ
వనఘము రాజులటఁ జేసి ♦ యనఘాత్మా! సుద
ర్శనబుధుఁడని పిలిచెద మిఁకఁ
గనుఁగొనుము నిజాన్వవాయ♦గౌరవసరణిన్॥

క॥ అన విని హారదత్తబుధుం
డును వారలఁ జూచి యపు డ♦నూనస్మేరా
ననుఁడై యిట్టుల ననియెను
ఘనతరమకరందసార♦కనదురుసూక్తిన్॥

తే-గీ॥ అయ్యా! చెలియలి వెలిఁబెట్టి♦నట్టివారు
మీరు గారేమొ? శూద్రుల♦తెరు దూర
మెత్తి కూడును నీరంబు ♦ లిచ్చినట్టి
దాతలో కారో? యేమని ♦ తలఁపవలయు॥

తే-గీ॥ ఏను మజ్జనయాత్రియు ♦ నేఁగుదెంచు
నపుడు మముఁ బల్కరింత త్ర♦పాకరంబు
గా మది దలంచినట్టి ని♦ష్కామధీరు
లో వినుఁడు ప్రస్తుతపునుడు♦లును గ్రమమున॥

సీ॥ రహి ద్వాదశోర్ధ్వపుం♦డ్రములు దీర్తురు మీర
లొడలెల్లబూదిఁ బూ♦యుదుము మేము
సొగసగు బంగారు♦నగలు దాల్తురు మీరు
రుదురాకపూస లే♦యుదుము మేము
ద్రవిడమంత్రములనెం♦తయును బ్రేమింతురీ
రేమో త్రయినె యాశ్రీ♦యింతుమెపు
చిదచిద్విశిష్టంబు ♦ సిద్ధాంతమది తమ
కదియు శక్తివిశిష్ట ♦ మమరు మాకు

తే-గీ॥ చక్రముద్రాంకితులు మీరు ♦ శర్వలింగ
ధారులము మేము విష్ణుమ♦తంబు మీది

# హారదత్త విజయము

వమతమగు మాది నిస్సంశయముగ
ాకు మాకును బో జెట్లు చేకుఱు నిఁక॥
శ్రీశై నను మీరలు
ాతులు లగు నెంతయేనిమాన్యులు మఱియుఁ
ీతినొ యప్రీతినొ నా
ాతను నను సాఁకితిరి సమంచితచరితుల్॥

ావున.

ందనపురస్సరం బొ
ందితమతి నొసఁగువాఁడ నాకొన్నల మీ
ందుఁడని యొసఁగె సెల్వలఁ
ందనపున్హారముల మిగుల రొక్కములన్॥

ంత వా రత్యంత్యంబు సోదరిని హారదత్తుని విష్ణుకంచి కాహ్వా
ంబుచేసినను వా రొడంబడక యందు హారదత్తుం డవ్వారికి
రల నిట్లనియె.

మతంబును బాసి శ్రీవైష్ణవమతంబు
నను నన్నుఁజేర రమ్మనుట యొకఁడు
విష్ణుగరిమంబు శ్రీవైష్ణవమతంబు
ఘనతను ననుజెప్పుమనుటయొకఁడు
ామనాథుని యీకాంచి విడి మమ్ముఁ
విష్ణుకంచికిఁ జేరఁ బిలుచు టొకఁడు
ంతోడ నేని మీవారితంబుతో నేని
కుడువంగ మమ్ము రాఁగోరు టొకఁడు

తా మేది కోరిన గారవమున
క్షణమె యట్టిపనిని నవ్యాజమతి భ
నుఁడు నిర్వహించు నేబాధ లేదు
ంఁడు నుతులివె వైష్ణవస్వాములార!

ంటయు వారలు సత్కారంబులు గైకొనియుఁ జిన్నవోయిన
నంబులతో మరల విష్ణుకంచి కేఁగిరి.

—: హరదత్తుఁడు తీర్థయాత్రసలుపుట :-

క॥ హరదత్తుం డంతనె యీ
హరిదంతరపుణ్యతరమ♦హాస్థలయాత్రన్
హరువుగ సల్పఁగ జననిని
బరిజనులను బుధులను గొని ♦ పయనము చేసెన్॥

సీ॥ ఏ పురంబాకామా♦క్షీక్షింపఁజాలిన
జనులకఁ బాపసం♦చయముసురుఁగు
ఏ పురంబున జగ♦దేకమాతృకతోడఁ
దాండవంబాడుఁ గం♦దర్పజేత
ఏ పురంబున సన్ము♦నీశాగ్రణులకు న
ధ్యాత్మోపదేశంబు♦హరుఁడొనర్చె
నే పురంబునను మ♦హేశ్వరకరుణకు
గుఱియయ్యె నుపమన్యుఁ♦డురుతపస్వి

తే-గీ॥ ఆ పురం బిల మోక్షల♦క్ష్మీపురంబు
గురుతరజ్ఞానహార్మ్యాగ్ర♦గోపురంబు
శ్రీపరాంబామహేంశాంఘ్రి♦నూపురంబు
భవ్యతరమగుశ్రీచిదం♦బరపురంబు॥

తే-గీ॥ చేరి పుష్కరిణిన్ గ్రుంకి ♦ చిత్సభాప్ర
వేశ మొనరించి శ్రీతాండ♦వేశమూర్తి
నార్య కామేశ్వరినిఁ గొల్చి ♦ హస్తిముఖుని
షణ్ముఖునిని భజించి బాల♦సంతోసమున॥

క॥ స్ఫాటికలింగార్చనమును
నీటగుమాణిక్యమూర్తి ♦ నిరతిశయార్చన్
హాటకసభాలయము న
చ్చోటం గల దివ్యరాజిఁ ♦ జూచి ప్రియమునన్॥

తే-గీ॥ మధుర కేగి సువర్ణప♦ద్మహ్రదమున
మునుక లొనరించి సుందర♦మూలలిం

మును శఫరనేత్రి నార్యను ♦ బూజచేసి
తత్పరివారదేవతా♦తతికి మ్రొక్కి॥

శ్రీరామేశ్వరధామము
నారామనృపాలకృతని♦రతిశయపుణ్యా
శ్రీరమ్యహర్మ్య మర్మిలిఁ
జేరి యిటన్ సకలతీర్థ♦జీవనతతులన్॥ 88

సేతువులో దురితహరణ
హేతువులో నుభయజలధి♦హృద్యోర్మిలస
త్పూతోదకమండలి సు
స్నాతు లయి కడున్గడున్ బ్ర♦శస్తహృదయులై॥

ముందు హనుమత్ప్రతిష్ఠిత♦ముగ్ధచంద్ర
కేశు విశ్వేశుఁ దద్దేవ♦తేశురాజ్ఞిఁ
బూజనముచేసి రామేశుఁ ♦ బూజచేసి
జననిఁ బర్వతవర్ధనిఁ ♦ జక్కఁగొలిచి॥ 90

హేరంబుని షణ్ముఖునిన్
వారలవారిజముఖులను ♦ వారనిభక్తిన్
సారెకుఁగొలిచి సకలపరి
వారామరతతి భజించి ♦ వరుసగ నంతన్॥

కదలి మాతృభూతేశ్వర♦గ్రామ మొంది
యింపుమై నమ్మహేశుఁ ద♦ద్హృదయదేవి
సురభికుంతలమాతను ♦ సురుచిరోరు
భక్తిఁబూజించి జంబుకే♦శ్వరముఁ జేరి 92

జంబూద్రుమంబుఁ గని యఘ
జంబాలముఁ బాపునట్టి♦సర్వేశు నుమన్
బంబినభక్తి భజించి ర
యంబున శ్రీరంగపట్ట♦ మరిగిరి వేడ్కన్॥

వెలయు నేవీటఁ గా♦వేరిమహానది
దక్షిణోత్తరదిశా♦ధామములను

చ తు ర్థా శ్వా స ము

బవళించియుండు నే ♦ పట్టణంబున భోగి
రాజతల్పంబుపై ♦ రంగభర్త
సిరితోడ ధరతోడఁ ♦ జెలగుచు విభు నెందు
నలరించు రంగతా♦యారుకరము
నివసింతు రేయూర♦నిర్మలాత్ములు వేన
వేల్ వైష్ణవోత్తముల్ ♦వీధులందు
తే-గీ॥ అట్టి సప్తావరణవైభ♦వాతిశయప
రీతశోభితమగు నప్పు♦రీవరంబుఁ
జేరి కావేరిజలమాడి ♦ శ్రీసనాథు
రంగనాథుని సేవించి ♦ రాణగదుర॥

తే-గీ॥ అంతఁ గుంభఘోణంబున ♦ కరిగి భక్తి
గరిమఁ గుంభేశు దన్మనః♦కాంత నార్య
మంగళాంబను బూజించి ♦ పొంగెసంగ
నమరునాగేశుఁ దత్సతి ♦ నంబఁగొలిచి॥

వ॥ ఇఁక ననేకంబులగు శివలింగంబులకును దదవరోధంబుః
న్మాతలకును మ్రొక్కులిడి.

క॥ వైద్యేశ్వరపురి భవరు
గ్వైద్యేశ్వరు వేదవేద్య ♦ వైభవసుభగున్
విద్యుద్వర్ణకపర్దున్
సద్యశ్శ్రేయఃప్రదాన♦చతురు మహేశున్॥

క॥ బాలను విదలితభవజం
బాలను బాలేందుశకల♦పరిభాషితచూ
డాలను నీలమణీఘృణి
జాలను సేవించి సంత♦సం బిగురొత్తన్॥

మ॥ తిరువణ్ణామల కేఁగుదెంచి యచటన్ ♦ దేవాదిదేవున్ గృ
కరభావున్ గలహంససూకరవరా♦కారాత్మభూహార్యగో
చరమూర్ధాంఘ్రివిరాజితోజ్జ్వలతనున్ ♦ శైలాధిరాట్కా
పరివస్యాపరితుష్యమానసు లస♦ద్భక్తైకరక్షావశున్॥

క్తి నవీతకుచాంబా
క్తిని నిఖిలాబ్జజాండ♦సంరక్షణకృ
స్వక్తినిఁ గృతభక్తాంహో
ముక్తిని భజియించి మిగుల ♦ ముదితాత్మకులై॥

చటియుఁ బళని తిరుత్తని తిరుశైలంబులందు సుబ్రహ్మణ్య
క్తాబ్రహ్మణ్యప్రశమను బూజించి శ్రీకాళహస్తిపురిఁ జేరి సువర్ణ
ముఖరీధునిఁ దోయంబులాడి జ్ఞానాంబాహృదయపుండరీకభా
రు శ్రీకాళహస్తీశ్వరు సేవించి యనంతరంబు శ్రీపర్వతంబుఁ
రి యందు శిఖరాగ్రసందర్శనం బొనరించి.

తాళగంగను ♦ స్నాతులై మల్లీశు
ఫుల్లారవిందాళిఁ ♦ బూజచేసి
మరీశక్తి క♦పచితినింబొనరించి
పంచాక్షరీయంత్ర♦భస్మ మలఁది
క్షిగణేశుని ♦ సారంగనాథుని
హాటకేశానుని ♦ నర్చచేసి
రామవీరేశ్వ♦రాంఘ్రుల సేవించి
తక్కినయట్టితీ♦ర్థముల నొంది
పురరాక్షసహంతఁ ద♦ద్దేవదేవి
మహానందిలింగంబు ♦ నార్య గౌరి
మల్లింగేశు జోగుళాం♦బను భజించి
మ హేలేశ్వరు నిఁకఁడ ♦ త్పత్నిఁ గొలిచి॥ 102

ర్ణక్షేత్రముఁ జని
ర్ణాభరణకర్ణు ♦ గురుతరకరుణా
దశాస్యసుకృతపరి
శుభాకారుఁ గొలిచి ♦ పత్నీసహితుల్॥ 103

రాష్ట్రసోమనాథుని
కృపానిధిని భీమ♦శంకరమూర్తిన్

# చతుర్థాశ్వాసము

ధీరు మహాబలనాయకు
భూరిపరళీవైద్యనాథుఁ♦బూజించి తగన్॥

క॥ ఘుశ్మేశ్వరునిన్ దారుణ
రశ్మిబృహద్రశ్మితుహిన♦రశ్మినయనునిన్
గశ్మలహరు మునిమానస
వేశ్మచరున్ బూజచేసి♦విశ్వేశరణ్యున్॥

వ॥ మఱియు ననశ్వరభోగేశ్వరు నాగేశ్వరు నర్చించి గౌత
దిపుణ్యాలంబునఁ ద్ర్యంబకదేవు నారాధించి సంకటహార
కారపరమేశ్వర విమలేశ్వరులను బూజనంబొనర్చి త్రిజ
మానవైభవుం డగునుజ్జయినీమహాకాళదేవుని సేవించి
విశాలిణనకృపాళునేపాళపశుపతిన్ భజియించి మోక్షశ్రీ
కేదారుఁ గేదారదేవు నవ్వర్ణంబొనరించి నిరపాయదయా
జితాభూమివైద్యనాథు నమస్యసల్పి యానందకాననం
యందు.

సీ॥ నిరవశేషితపాప♦నిర్మలాంభశ్శ్రేణి
మణికర్ణిక నొనర్చి♦మజ్జనంబు
ఔపనిషదపద♦వ్యాకృతనిజబోధు
విశ్వనాథు బ్రపత్తి♦వెలయఁగొల్చి
చేటికాభూతకు♦శేశయపాణి స
రస్వతి నన్నపూ♦ర్ణను భజించి
సర్వవిఘ్నధ్వాంత♦చండమయూఖు డుం
ఠికరీంద్రముఖుఁ దని♦యక యజించి

తే-గీ॥ భూరమాధవు మాధవుఁ ♦ బూజచేసి
కాలభైరవపాదయు♦గ్మమున వ్రాలి
యక్షరాజాంఘ్రివనజంబు ♦ లర్థిమ్రొక్కి
తక్కఁగలయట్టివేల్పులం♦దఱకు నెఱఁగి॥

సీ॥ మునియప్పుఁదీర్పఁబూ♦నినహరిశ్చంద్రుండు
వెలఁది నమ్మినయట్టి♦వీథిఁ గాంచి

డిగపూఁబోఁడి ♦ నెనయఁజొపఁడు మధు
కలశమొందినయష్టి♦నిలచు నురసి
దియశ్వమేధంబు ♦ లొదవించి లింగప్ర
తిష్ఠ సల్పిననల్వ♦ తెఱఁగు నెఱిఁగి
ల సుశీలయుఁ బ్రత్య♦హంబు తీర్థం బాడి
నటిజ్ఞానోదక♦ప్రహదముఁ గాంచి
పన్నిద్దఱుర్కులు ♦ హరువుమీఱ
రుని సెలవొంది చెంది య♦పురమునందె
ంతులై సంచరించువై ♦భవమును గని
ఱసి జోతలనర్పించి ♦ ముందు కేఁగి 108

ర్థరాజంబుఁ జేరి మాధవేశ్వరీమహేశ్వరులనర్చించి గయాక్షే
ంబునఁ బితృదైవత్యంబులగుకృత్యంబుల నిర్వహించి మంగళ
రిని సమంత్రవిధినర్చనంబొనరించి భువనేశ్వరభీమేశ్వరలింగంబుల
రాధించి గౌతమీకృష్ణవేణీమహావాహినీసలిల సందోహంబుల
వగాహనంబొనరించి సంచరితనగరాస్థానంబు లందెల్ల మహే
ర్వరపారమ్యనిర్ణయంబుఁ బ్రకటనంబొనర్చుచు నందందలి పాశు
తాగ్రణుల సేవించి యభినందింపుచు నందును శ్రీనీలకంఠశివా
ార్యుస దేశికునిగ వరియించి తత్ప్రసాదంబుఁబడసి కతిపయదినం
ులు కాత్మనివాసంబుఁ జేరి రంత హరదత్తుఁ డనన్యసామాన్య
ుదుషీవిశేషభూషితుండై ప్రతిదినంబునందు సర్వదర్శనాపార
ండితీగంభీరంబులగు మహోపన్యాసంబులొసంగుచు నుత్తమ
ంథంబులనిబంధించుచు సర్వవేదతాత్పర్యనిర్ణయంబు సంధానించె
ాపెఁగొంతకాలంబున కాఁ

## —: హరదత్తుని వివాహము :—

ద్మినినిఁ బోల్పఁగలయొక
ద్మినియనుకన్యఁ దెచ్చి ♦ బహుమతమొప్పన్
ద్మణి యొకవిప్రుండు హ
ద్మండలియలర నిడి పరిణయమొనర్చెన్॥

# చతుర్థాశ్వాసము

వ॥ పద్మినీహారదత్తిలకుం గ్రమంబుగ నేకామేశ్వరమహా నీలకంఠచంద్రశేఖరశంభుమహార్ఘ్యనేశ్వరులనుపుత్త్రిలున మీనాక్షులను గూఁతులును జన్మించి యభివృద్ధినొందుడ కలను బాత్రులనువరుల కొసఁగి యుద్వాహంబొనర్చి వేదవేదాంగంబులఁ బారంగతుల నొనర్చె నవల నాస్థానస్థలివసుమతీపతి యభ్యర్థనంబున భక్తియోగంబును గూర్చి చర్చించి యుపన్యసించుచు నొక్కయైతిహ్య ప్రతిపాదించె.

## చండకభిల్ల చరిత్రము

క॥ పాంచాలదేశమును బా
లించు నొకం డరిజనావ♦లేపహరుం డ
భ్యంచితశివలింగార్చా
చుంచుం డిలసింహకేతు♦శుభనామకుఁడై॥

సీ॥ కలలోన నేఁ బర♦కాంతల మొగమును
జూడఁగాఁ దలఁపని♦సురుచిరాత్ముఁ
డాకలిఁగొనియేని ♦ యపరిశుద్ధాన్నంబు
భుజియింప నెంచని♦పుణ్యశీలుఁ
డలిగియుండియు నేని ♦ యనుజీవులను గూడ
నొవ్వఁబల్కనియట్టి ♦ నుతచరిత్రుఁ
డక్కఱపడియేని ♦ యన్యధనంబుల
హరియింపఁబూనని ♦ యమలహృదయ
తే-గీ॥ డలసియేనియు దేవగు♦ర్వగ్రజన్మ
ధేనుపూజల మానని♦ధీరమూర్తి
భ్రమసియేని యసజ్జన వర్గగోష్ఠిఁ
జేరనట్టి యకల్మష♦చిత్తుఁ డెపుడు॥

క॥ సముచితగతి నాతండు వ
సుమతిఁ బాలించుచుండ ♦ సుడివడి రొకఘ

)మునందు జానపదజా
ము దనిసి రయమున వ్రోఁతలను సల్పిరిటుల్॥ 114
)లులుఁ భల్లుకముల్ వనేభము లెనుంబోతుల్ వనీసూకరం
)లు సింగంబులు ఖడ్గసంఘములు దుప్పుల్ మన్నుగానొప్పన
)లవత్కాననజంతుసంతతులు పైపై రేగి మాగోగణం
ల సస్యంబులఁ బొట్టఁబెట్టుకొని యేపుఁ మీఱుచుండెఁ విభూ!
'లుర నంగనాతతుల భద్రము సేయుటె మొక్కలంబుగాఁ
ాలుచునుండె నింక నెటు గ్రామములందు మనంగ నేర్తుమ
గ్యా! లవ మాత్రచిత్తమున నక్కటికంఁ గొని వేగ వచ్చి స
ప్తాళినిఁ గూల్చి నీ జనుల ప్రాణములఁ బరిరక్షసేయుమా!
గొనరింప కీవిఁకను సత్వరమే పయనంబు సేయఁగా
గు మఱొండు కార్యమును భావనసేయకు మా ర్తజీవర
ాగరిమంబుఁ బోల్పఁగలచక్కటు లెందులభించు నీకు నీ
గణియింపు మన్నియును సిద్ధచరిత్ర! పవిత్ర! పేర్మిమై॥
)నంత మహీనాథుం
ముకంపదలిర్ప వేగనాఖేటక యో
కాయమునకు జేపు గ
నమును జేరవలె వేఁటలాడఁగ వేగఁ॥ 118

—: సింహకేతుమహారాజు వేటకేగుట :—

శాసించి,
టూరులవారి కభయముఁ జూపి
)వొసఁగి పంపె వారలు చేరఁబోయి
క్మపురముల కిచట వాహ్యాళిధీరు
)రుఁ గడుహర్షంబు వెల్లివిరియ॥ 119
పలు బారుటీటెలును బాఁకులు బల్లెము లుక్కుకోలలుఁ
ంగదలుఁ ద్రిశూలములు సింగిణులుఁ బలుతీవ్రకైదువుల్
శులు దుడ్డుకఱ్ఱలును బాశము లుద్ధతసార మేయముల్
)గఁ గూర్చి యార్చి సరవిఁ బయనంబు నొనరిచి రేపునఁ॥

తే-గీ॥ విధునితోఁగూడ నడిచిన ♦ వేఁటకాండ్ర
లోన నొక్కఁడు శబరుఁ డ ♦ నూనబాహుః
బలుఁడు చండకుండను పేరఁ ♦ బరఁగువాఁడు
యుద్ధభటులందుః గూడఁ బ్ర ♦ సిద్ధమూర్తి॥

క॥ భూతదయ దైవభక్తి మృ
షేతరవాఙ్నయతి గలిగి ♦ యెసఁగు నతఁడు వి
ద్యాతతవివేకరహితుఁడు
చాతురి యెక్కుడుగలేని ♦ జనమాత్రుండై॥

తే-గీ॥ సైనికులలోనివాఁడయ్యు ♦ జనపతి యను
శాసనంబుననతఁడు ని ♦ శాతభల్ల
చాపశరధరుఁడై యట ♦ వీపదంబుఁ
జేరవచ్చెను వేఁటాడఁ ♦ జేవమీఱ॥

ఉ॥ ఇనుఁ డుదయించునంతకె మ ♦ హీశ్వరుఁడున్ మృగయావి
ఘనగహనస్థలిన్ దఱిసి ♦ కాఱెనుఁబోఁతుల నెల్గుబంటుః
వనకిటులన్ మదేభముల ♦ వ్యాఘ్రములన్ బహుసింహ
దునిమిరి గట్టులట్టువడె ♦ దుష్టమవోద్ధతసత్వసంతతుల్॥

క॥ ఒకరికి నొక్కరు గలియక
నికరపుబాహుబలవీర్య ♦ నిపుణతఁ దమచూ
డ్కికి ననువగుదిశ నెక్కొని
సుకరముగ వధించిరంత ♦ క్షుద్రమృగములన్॥

ఉ॥ చండకభిల్లుఁడున్ గడుఁబ్ర ♦ చండభుజాతతవిక్రమోన్నః
దండియెలుంగులన్ బులుల ♦ దంతినిహంతల ఖడ్గవర్గః
మొండగునేదుబందులను ♦ మీఱుచు వంచి వధించె న
గ్గొండలవోలెఁ బృథ్విపయిఁ ♦ గుప్పనఁగూలె హతాప

తే-గీ॥ సూదవిద్యావిశారద ♦ స్తోమమును ని
తరపరిజనంబులను గొసె ♦ తఱలి వచ్చి
యొక్కకాసారరాజంబు ♦ ప్రక్కఁబటకు
టీరమును గూర్చి సర్వంబుఁ ♦ జేరిచి యట॥

ప్పన్నంబులుఁ బులుసులు
ొప్పకుఁదగినట్టియిగురు♦కూరలు చేరుల్
ప్పడములు వడియంబులు
ొప్పుగ సిద్ధంబుచేసి ♦ యుంచినయంతన్॥

ంతకు మున్నే సంకేతంబుచేసికొనినవారలు గావున ద్వితీయ
నూమాంతంబువఱ కాఖేటంబుసలిపి యేకీమీఁదును బరిజనంబు
ను దటాకంబు సమీపించిరి.

బలాతపక్లాంత♦బహులాధ్వనీనవి
తానని తాంతసం♦తాపహరము
దక రేణుసనాధ♦మాతంగరాజమ
జ్జన కేళిశిథిలోర్మి♦సముదయంబు
కటస్థితమహా♦నగశిరస్థలకంద
రాంతరాళాంబుధా♦రాంచితంబు
నతపోవనముని♦కాంతావగాహన
హరిద్రచూర్ణపం♦కాంకితంబు
కలీకూజితాత్యంత♦గానచతుర
క్రచక్రాంగశుకపిక♦శారికాఘ
కకంఠస్వనముఖరి♦తాఖిలాశ
రుస మిడెమధురోద మ♦బ్జాకరంబు॥ 131

ంత,

పతియును బరిజనమును
దగునవ్వేఁటకాం(డు ♦ ప్రీతిమెయి నటన్
రుసజలమాడి జగ్గిన్
పిరి చండకుఁడు నాగ♦శబరుఁడు వెలిగా. 132

తఁ డందఱ మిగిలి కడున్
తభుజాశక్తి యుక్తి♦వేఁటాడి మహో
తసత్వములఁ జదిపె నని
తులితయోధుఁడని పొగడి ♦ రందఱు వానిన్॥

## చ తు ర్థా శ్వా స ము

### ఆశ్వాసాంతము

క॥ శతధృతికరోటమాలా
వితతోరస్థ్సాన! కాద్రవేయసముదయో
చితభూషణసుకపర్దా!
హతభాస్కరిగర్వ! మల్లికార్జున దేవా!

గద్య– ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాప్రసాదితసుకవితా భ
బుధజనవిధేయ ముదిగొండనాగవీరేశ్వరనామధేయ విరచి
హారదత్తవిజయకావ్యం బందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





# హరదత్తవిజయము

## పంచమాశ్వాసము

ాధసోదరీచే
నళినద్యుమణిమూర్తి! దుర్వారతర
నాభియుక్తభక్తని
నా! శ్రీశైలవసర♦తా! మల్లేశా!

వా! అవధరింపుము.

—: భిల్లుఁడు శివలింగంబుఁ జేకొనుట :—

రుఁడు పెక్కుసత్త్వములఁ ♦ జంపియుఁ దక్కినవానిపట్లు తా
బటకుటీరముల్ దఱియు♦నుం జనుచుండఁగ మ్రానిదట్టపుం
రులమధ్యఁ బాడువడి ♦ కూలినపుట్టిశివాలయంబు దృ
బడుడు నంత లోపలికిఁ ♦ జేరి కనుంగొనె దివ్యలింగముల్॥

త నతండు.

పీఠపతిత మయి♦పృథివి నొరగి
న్నలింగము నాత్మకీ♦యోరుభాగ్య
ము గా నెంచి గ్రహియించి ♦ పార్థివేంద్రుఁ
పటమందిరమును దా♦నొంది వేగ॥ 3

ఁగని మ్రొక్కి యిట్లని♦విన్నవించె
! చూడఁగదే యిది ♦ దివ్యలింగ

మనుపమము మామకీనభా♦గ్యస్వరూప
మర్చనముసేయుదున్ దెల్పు♦మా క్రమంబు॥

క॥ కూలిన దేవళమును భువి
వ్రాలినయీలింగమును బ♦రాకునఁగని లోఁ
జాలిఁగొని తెచ్చితిని జన
పాలా! యీదీనజనునిఁ ♦ బాలింపఁగదే!

—: భిల్లుఁడు రాజును శివపూజావిధిని జెప్పుమనుట :—

ఉ॥ మంత్రవిధిజ్ఞులై యలరు ♦ మాన్యుల పూజలఁ బ్రీతుఁ డం
మంత్రము రానియట్టియల♦మానిసులున్ గొలువంగఁ
తంత్రము గల్గియుండు నది ♦ దంటవు నీ వెఱుఁగంగలా
మంత్రవిదగ్రణీ! తెలుపు♦మా! శివతుష్టిగ నర్చనావిధిన్॥

క॥ నీవే గురుఁడవు హరుఁడవు
నీవే యొడయఁడవు దేవ♦నిర్మలభావా!
కావలుఁ డనిచూడకు హిత
పూవిధి నుపదేశ మొసఁగు ♦ మతివేగమునన్॥

తే-గీ॥ పూర్వకర్మప్రచోదిత♦బుద్ధితోడ
లింగమును దెచ్చి చూపి యు♦భంగభక్తి
నిట్లు పూజావిధిన్ గోరు♦నెఱుకుఁ గాంచి
యించుక హసించి యిట్లనె ♦ నెలమి నృపతి।

ఉ॥ ఎక్కడినుండి తెచ్చితివి ♦ యేటికి నీకిది పాడువడ్డయా
చక్కని నున్నయిమ్మహిత♦శాంకరలింగము ముట్టవచ్చు
చొక్కమెఱుంగకుంటి వట♦సోఁకు తెగల్ మఱి భూతస
బెక్కుడుచేరి యుండు హిత♦మెంచి వడిన్ గుడిఁజేర్పు! లిం

ఆ-వె॥ వెడఁగుబోయ వేడ♦విమలలింగం బేడ
సీధుపానమేడ ♦ బోధ యేడ
వేఁటసేయుటేడ ♦ వేదపద్ధతి యేడ
వలన దుడుగు! ద్ధీన వాసి లేదు॥

పడున్ గటకటవడి నా
పవున్ బైశాచభూత♦తతు లిఁక భక్షిం
ర మోదమువడుదును బా
ర మీలింగంబు నిచటఁ ♦ బాయఁగఁ జాలన్॥ 11

నిఁక నేఁటనుండి ధర♦ణీధవ!నీదుపదంబు లానగాఁ
ానికసేయువాఁడ మధు♦వున్ నిఖిలామిషమున్ ద్యజించితిన్
నిఁక వేటసేయుట క♦పూర్వతరాత్మము దోఁచెఁ బ్రేముడిన్
ాని వచింపుమా!శివుని ♦ పూజనపావనసుప్రయోగమున్॥

ఎన రాజిట్లనియె.

యీలింగమును గొని♦యుత్సుకతను
గృహంబున కేఁగఁగా ♦ నీదువధువు
ప్నఁ దెగనాఁడు లింగంబు ♦ నీటఁద్రోయు
ానుమీ లింగపూజను♦మంచి నెంచి॥

ముగ దంపతు లెపుడు హి
రాన్నసుగంధపాన♦తర్పణముల నా
కు సంతసంబునిడుచు మ
న్ గడపుటయె మేలు ♦ నీ వదిగనుమా! 14

మున్నదియో లేదో
మన కేవేవో కొన్ని ♦ పచరించి వృథా
మలయుదు రిట నొకకొం
ు నీ వాబాటఁబోకు ♦ తనియు సుఖమున్॥ 15

శబరుండిట్లనె నో
నాథ!మదీయభార్య ♦ చక్కఁగ నిఁక నా
వమున కెదురుగనాడినఁ
లేదిఁక బొమ్మటంచుఁ ♦ బనిచెద దానిన్॥ 16

ఁడనె శర్వలింగమున ♦ కోపిక నర్చనచేసికొందుఁ దా
ముపదేశపద్ధతికి ♦ వార యొకించుక గల్గనీను మో

రక్షుఁ డనిచూడఁబోవు మిఁక ♦ రాజశిఖామణి! యచ్చ్వై
చ్చికఁ బరిశీక్షణంబొసంగు! ♦ శ్రీశివలింగసమర్చనావిధిన్॥

వ॥ మఱియు.

తే-గీ॥ అధిప! ఆహారనిద్రాభి♦యంబులందు
మిథునభోగంబులందె నర్ ♦ మెలఁగుమనుచు
హితవు బోధించెదవయేని ♦ యెఱుకటంచు
సమ్మతమె యైన నాలింపు ♦ జడునినుడిని॥

క॥ మానవుఁడె కావలయునె?
ధీనిధి! యిఁకఁ బ్రాణులెల్ల ♦ తివిరి యశనని
ద్రానిధువనభయముల నెం
తేనియునుంబడయుఁగాదె ♦ యెఱుఁగనె? వానిన్॥

తే-గీ॥ పరము లేకున్నఁ బున్నెంబు ♦ పాప మెదియు
లేకయున్నను నరయంగ ♦ నీకనుపడు
జగము నందెట్టులొదవె దృ♦ష్టంబు గాఁగఁ
దారతమ్యంపుసృష్టియుఁ ♦ దదనుస్మృతియు॥

క॥ ధేనువునర్ బూజించుట
శ్వానంబున కెంగిలిడుట ♦ చక్రాంగము న
న్యానప్రీతిన్ బెనుచుట
పూనికనై వాయసమును ♦ మోదుట తాలన్

వ॥ సర్వజ్ఞుఁడగు నీ కెదురాడఁ గలాఁడనే మన్నించి నా
బును బోధింపుము.

చ॥ అనుటయు తేఁడు వీఁ డెటుల♦నాడినను విడువండు కీ
ర్చనయెడ సుంత మానస మ♦సహ్యమునొందఁగఁ జేయ
నను నెటుసల్పునో. యనుమ♦నంబున నిట్లు హసించుచు
చెను వినుమోరి! చెప్పెదను♦క్షిపరిము శాంకరపూజనంబొ

—: భిల్లునకు రాజు శివపూజాక్రమంబుఁ జెప్పుట :—

ఉ॥ స్నానముసేయఁగావలె ను♦పస్నన మద్దను గట్టఁగావలె
మేన విభూతిఁబూయవలె ♦ మేలగుచ్రందన-మక్షతంబులు

పానము లచ్ఛబిల్వములు ♦ శోభితగుగ్గులు ధూపదీపముల్
తేనియ చాఱపప్పులును ♦ దీయనిపండ్లను దండులాన్నముల్॥

ద్ధపఱచి సంకల్పంబుఁ ♦ జెప్పి శివుని
్యానమొనరించి యుచితాస♦నార్ఘ్యపాద్య
మలతీర్థాభిషేకముల్ ♦ విధిగ నొసఁగి
సితగంధాక్షతంబు ల♦ర్పణముచేసి॥ 25

మముల బిల్వ మొసఁగి ధూ
పమునిడి గవ్యాజ్యదీప♦పఙ్క్తి నిలిపి య
ష్పములని వేదనకుం బూ
వ్యమునన్ గలవొక్క యవస♦రవిధి యరయుమా!

ంకరుండు చితాప్రదే♦శంబుఁ జేరి
నచటిభస్మముఁ బ్రీతిమై♦నలఁదు నెపుడు
ానఁ దద్భూతి శివునకుఁ ♦ గరముప్రియము
ముందు నైవేద్య మిదు! చితా♦భూతి నెపుడు॥ 27

ానన నీకు శంకరుఁ డు♦దారతరాత్ముఁ డనుగ్రహించి స
్మానముతోడ మోక్షము స♦మర్పణసేయఁగలండు రూఢిగాఁ
ూనికతప్పనీక యొక♦పూజనవస్తు వలభ్యమైననున్
ననిని నేమఱందగ ది♦దే కడతేర్చు నుపాధిదుఃఖమున్॥

ంవల మధురఫలము ♦ లభిమతభక్ష్యంబు
న్నపానములను ♦ నారగింపు
వేసి విడెమునిడి సు♦వాసనాఘనముఁ గ
ప్పురము వెలుఁగుఁ బట్టి ♦ పూలువేయు!

ి పైన మ్రొక్కి శివునకుఁ
ాప్రము నృత్తంబుపసను ♦ శోభితగతి నిం
ాపాటఁబాడి వినుచుము
ాపల మొందక యొనర్పు ♦ శర్వార్చ యిటుల్॥ 30

అనంతరంబున దత్ప్రసాదంబు మీరనుభవింపుఁ డని యొడయండు

నుడివిన నన్నిషాదుండు నిండగునామోదంబుతో నృపు
లకు మ్రొక్కి యిట్లనియె.

క॥ గురువచనమునందొక యు
క్కురమైనను దప్పనీక ♦ గడుపుదు వ్రతముల్
గురుఁడవు పరమేశ్వరుఁడవు
హరుఁడవు మామకదురద్ధ♦రాఘతతులకున్॥

వ॥ అని యభినందించి తన్నుఁ గుడువఁబిల్చువారలకు శివపూ
సేయక మున్ను సాపడనని జనపతిసెలవొంది కదలి మరె
బుననే కొన్నితరుశాఖల లింగాచ్ఛాదనకుటీరంబునకై
కొని వన్యపుష్పబిల్వచందనకాష్ఠగుగ్గులంబుల సంతరించి
మయామంబున నిలుఁజేరి తనకై యెదురుసూచుచున్న
లిం గాంచి యిట్లనియె.

మ॥ చెలువా! నిన్నును నన్ను మన్పఁగ నిటుల్ ♦శీతాంశు
కలితాపీడమనోజ్ఞలింగము వనిన్ ♦ గన్పట్టఁగాఁ దెచ్చి
ఫలమంచున్ దలపోసి యస్మదుదయ♦ప్రాముఖ్యసంసిద్ధి
చలనంబున్ గనవట్టిభావమున న♦ర్చన్ జేయ శ్రేయంబగు

తే-గీ॥ అనుచు మాటవిప్పి ♦ యభవలింగముఁ జూపి
గీముకెదుట నొక్క♦దీముఁ గూర్చి
పీఠశిల నమర్చి ♦ భీమలింగముఁ జేర్చి
తక్కు గలుగువస్తు♦తతినిఁ దెచ్చి॥

—: భిల్లుఁడు శివపూజసేయుట :—

క॥ స్నాతుఁడయి సన్నికృష్టన
దీతీర్థముఁ దెచ్చి యాజ్య♦దీపం బిడి సం
ప్రీతి నిజదేశికోచిత
రీతిమెయిన్ బూజన మొన♦రించి కడువడిన్॥

తే-గీ॥ తాను సతియును దత్ప్రసా♦దంబు మెసవి
శివునిముందఱ భజనంబు♦చేసి ప్రహార

యుగ్మమగునంతకుఁ దేగి ♦ యుగ్మలియును
తెతఁడు నిద్రించి కరుణోద♦యంబుదనుక॥

నింత వారిద్దరు ప్రబోధ♦మంది రప్పు
డెఱుకు ప్రాభాతికక్రియ ♦ లెలమి సలిపి
నమునకు నేఁగి సుకుసుమ♦బైల్వపత్ర
మధురఫలములఁ దెచ్చి య♦మర్చె నర్చ॥ 38

లుతటిదినమందునసే
యొలికికిఁ జని ప్రేతభూతి ♦ యురవగునొకమ్మ
లశము నిండుగఁ గొని తన
లయమునకుఁ జేర్చి పూజ ♦ నిచ్చలొనర్చెఁ॥

ది లుప్తంబగునంతకె
దనెఱేఁగి ప్రేతభూమి ♦ కరిగి విభూతిఁ
దిలంబుగఁ గొని వచ్చి త
దుసదనముఁ జేర్చుకొను న♦నారత మతఁడుఁ॥ 40

శబరపత్నియును గడు
శలకారుణ్యభావ ♦ విభుచిత్తాధీ
శయ పెనిమిటిదెచ్చిన
శివలింగమును బ్రేమ♦సేయుచు నుండెఁ॥

మరముకల్గినతఱి దే
ముపై లోభంబుఁ బాసి ♦ యని కరుగుట యు
మ మొండుదక్క నితరది
ములందున నెట్టి పని యొ♦నర దాతనికిఁ॥ 42

సమాసంబునకు నొక♦మాఱు తా ది
ణమునకేగి జీతంబుఁ ♦ బడసి తెచ్చు
నుట యొక్కటియే యుండుఁ♦బని తనంత
పుడు ననితరాధీనుఁడై ♦ యెసఁగు టొప్పు॥ 43

ద్దానఁ బ్రీత్యాహం
దియుఁబొసగక యె జగద♦ధీశార్చన బల్

హాష్దగ జరుగుచునుండెను
దద్దయుఁ గాలంబుగడచె ♦ దంపతుల కిలన్॥

వ॥ అర్చనారంభంబు మొదలుకొని పదిరెండువత్సరంబులైన
శబరున కేఁబదివత్సరంబులును దత్సతికి ముప్పదియై దేఁ
డాఁటె నంత నొక్కనాఁడు.

ఉ॥ మజ్జనమాడి వచ్చి తగ♦మగ్నుగట్టి మహేశలింగపుం
బజ్జ సమర్చ్యవస్తువుల ♦ బాగుగఁ జేరిచి కూర్చి దీప మీ
మజ్జడతన్ జితాభసిత♦సంస్మృతి లేక యజించి యంతలో
నొజ్జనుడిన్ స్మృతిన్ బడసి ♦ యుల్కి గృహంబున బూది
తే-గీ॥ కలశమును గొని వేగంబు ♦ నొలికిమిట్టఁ
జేరి యందుఁ జితాభూతిఁ♦జేరెడేని
యును లభింపమి వేఱొక్క♦యూరి కాటిఁ
జేరి వెదకిన బూది చే♦కూరదయ్యె॥

క॥ అంతట విస్మితుఁ డార్త
స్వాంతుండును నగుచు నికట♦సంవసథసమూ
హాంతములఁ బ్రేతభూముల
నెంతయు శోధించినను న♦దృష్టేష్టుండై॥
తే-గీ॥ చరమయామమువఱకు శ్మ♦శానములను
జాల వెతకియు భస్మ మె♦చ్చటనుగనక
ఘట్టకుటికాప్రభాతప్ర♦కారమునను
నాత్మపురిఁ జేరి తనదుగే♦హమున కేఁగె॥
క॥ తత్సతియున్ జితాభ
స్మోత్సన్నత నరయనైతి ♦ నుచితమె యనిశూ
న్యోత్సాహయుఁ బత్యాగమ
నోత్సుకయును నగుచు ద్వార♦మొంది వసించెన్॥
తే-గీ॥ నాథుఁ డేతెంచుచుండ న♦న్నవల దవుల
నుండియే తద్వదనదైన్య ♦ మూహచేసి
భూతి సముపార్జితము గామి ♦ బుద్ధినరసి
మదిని మఱుగుచుఁ గన్గొనె ♦ మగని మొగము॥

ఆతం డుస్సురనుచు నట
భూతలమునఁ గూలి యశ్రు♦వుల రాల్పఁగ న
న్నాతుక దయితునిడగ్గఱి
యాతతదుఃఖాకులయయి ♦ యలందురె మిగులన్॥ 52

అంత నాతండు ప్రియురాలి♦యాననంబుఁ
జూచి వగచుచు నిట్లనె ♦ శుభచరితనొ
నేఁటితోఁ బూర్తియయ్యె నా ♦ నీ వ్రతంబు
కొరక లేదెందు భసితంబు ♦ తోయజాక్షి! 53

పురములలోనఁ బల్లియల♦పొంత శ్మశానములందు భూరిజా
గరమతి శోధనమ్మొనరఁ ♦ గాంచితి భస్మముసుంత యేనియున్
దొరకకపోయె మద్రచిత♦దోషము కారణమై తనర్చు నే
కరణముఁజెందెదన్ శివస♦మర్చనఁబాసి మనంగనేర్తునే? 

ననుడు నచ్చేడియయు భర్త ♦ ననుసరించి
కొంతసేపట్లు దీనయై ♦ కుంది యంత
ధైర్యమును జెంది నాథునే♦త్రద్వయమున
బాష్పములఁ బయ్యెదనునొత్తి ♦ పలికె నిట్లు॥ 55

ఏటికి? యింతదుఃఖ మది ♦ యీ భసితంబు లభింపకున్న నా
పాటికి లడ్డువంబులో! ర♦సాలఫలంబులో! నారికేళమో!
నేటగుపాయసోదనమొ!♦నేను ఘటింతు నొనర్పు మర్చ యీ
నాఁటికి జేపు దౌలఁబయ♦నంబొనరింపు!లభించు భస్మమున్॥

అనుటయు శబరుండిట్లనె
వనితా!గురుశాసనంబు ♦ వదలుదు నెట్లా
నె నుడివెఁ బరికరములన్
పనము చితాభూతి దీనఁ♦గను!ఫలమనుచున్॥ 57

అట్టి పరమార్థసాధకం♦బైన గురుని
శాసనంబును బాయఁగఁ ♦ జాల నెపుడు
భోజనమువిడి నిముసమీ ♦ బొంది నొంద
న్యమేటికి? సెలవీఁక ♦ నరయు!దయితః॥ 58

## పంచమాశ్వాసము

వ॥ అనుడు నమత్తకాశిని పాణివిభునియత్యార్తికి వగచి
మరలనిట్లనియె.

ఉ॥ ఐనను జింతలేదు విను ♦ మక్కట రెండువిపత్తు లీయెడః
బ్రాణవిభూ!ఘటిల్లె నదు♦పాయముచే నొకఁడేని వీనిలోఁ
మానుపఁజెల్లదే!వ్రతము♦మానుటయొండు మఱొండు
బోవిడు టందు నేనొకఁడు♦పోకడఁబెట్టుదు నాజ్ఞసేయుమ

క॥ బహుకాష్ఠపరివృతాస్మ
ద్గృహమును బడవేసి యగ్నిఁ ♦ గీలుకొలిపి నే
దహనముఁజెందెదఁ బయి ని
ర్వహిల్లుఁ బూజనము నీకు ♦ భవ్యచరిత్రా!

క॥ దయితా స్తమయం బాత్మా
త్యయనిభమేః యాగపద్య♦దారుణతరక
ష్టయుగంబున నిపు డొక్కఁడ
వియుఁగావున నెఱఁగి సెలవు♦వేగనొసఁగుమా!

తే-గీ॥ అనుట కతఁ డాత్మ నించుక♦హారుస మొంది
యును నిజప్రియకిట్లనె ♦ నోసి యెట్టి
భావమొందితి వోడలు త్రి♦వర్గసాధ
నంబుగాఁ దలపోయవో♦నాతి!మదిని॥

క॥ సంతతినిఁ జెందవై తివి
యింతకు భోగములఁ దనియ ♦ వెలపాియము నీ
వింతటివై రాగ్యంబును
నింతిరో!చెందుటకు నేమి ♦ హేతువో యెఱుఁగః॥

చ॥ మనకులమందు మాఱ్మనువు ♦ మాటికిఁ జెల్లుచునుండ
చ్చినతృటి నేడ్పుమాని యొక ♦ చిన్నవయస్సుగలట్టివా
కొని వరియించి సౌఖ్యములఁ ♦ గూర్మల నొందఁగవః
ట్లనెదవు తెల్పు నీ మనము♦నందలియాశయ మిందు స

క॥ అనఁ జెవులుమూసికొని జ
వ్వని "శివశివశివ"యని యనె ♦ బాడియె మీఁరి

ట్లనుచితములాడ మి మ్మె
ననుదాన విభూ!వినుము మ♦దాశయ మెల్లన్॥ 66

ఎన్నఁడు నాదుతండ్రి నను ♦ నీకిడి పెండ్లియొనర్చెనో యిఁకన్
ఎన్నఁగ నెన్నఁడీవు నను ♦ బాలవసేయుట కొందినావో నా
ప్రన్నము జీవితమ్మునఁ బ్రియ♦మున్ సకలమ్మును నాఁటనుండి నే
న్నఁగ నమ్మియున్న నను ♦ నీ విటులాడఁగఁ గూడునే విభూ!

హూఁఉమనువు విటగతి మన
నారలలో నొప్పనెడల ♦ వాసియనుచు సు
స్త్రీరత్నము లొప్పుదురే
నేరమతీ!యట్టివాకుఁ♦దీయకు మెప్పుడున్॥ 68

ఁకఁ బ్రాణపరిత్యాగంబున కెట్లొడంబడితి వనెదవేని విను.

ఖవి సకలప్రాణులు ను
ద్భవనిధనము లొందునట్టి♦తగవేకద! యీ
భవతారము నిత్యమొకో
వేకభావమునఁ గనఁగ ♦ వెనుకన్ ముందున్॥ 70

యమో శోఫమొ సన్నిపాతమొకొ వి♦స్ఫారజ్వరంబో మహా
ఎయ మింకొక్కఁడొ చేరవచ్చి యయిన♦మాద్యన్మహాసత్వసం
యఘాతంబుననైనఁ బానభృశతా♦సంప్రాప్తిచే నైన న
ృయ మావశ్యకభావి కాదె! కనవే!♦యవ్యాజభావంబునన్॥

శ నాదునిధనమున నిపు
నాజన్మంబు ధన్య ♦ మిఁక మ త్తనుసం
ానులు తలిదండ్రులును
ానుగఁ గృతు లగుదు రెంతొ ♦ మది నారయుమా! 72

పుఁ డిచ్చిన యీ తనువును
వపూజకు విడుచు టెంతొ ♦ శ్రేయ మదియున్
వున కుపకారమైనను
వనిన్ బాగడఁగఁ దర్మమె ♦ యద్దాని నిఁకన్॥ 73

# పంచమాశ్వాసము

క॥ సెలవిమ్ము వేగముగ నీ
నిలయంబును నూడఁగొట్టి ♦ నెట్టనఁ జితినిన్
సలిపి యటఁ జిచ్చునిడి ని
శ్చలమతి నీపదములొంది ♦ జ్వాలన్ బడుదున్॥

వ॥ అనంతర మ్మొక్కగడియలో నీవు భస్మంబు సంప్రాప్తః
మజ్జనంబునొంది నిష్ప్రత్యూహంబుగ శివారాధనన్ జే
వసిన నన్నిషాదుండు శివపూజాభంగంబునకోపక య
జూపె నంత.

తే-గీ॥ అ చ్చెలువ యిమ్ముఁబకఁదోఁచి ♦ యందుఁగల్గు
నిధ్మముల నెల్ల సెదఁబేర్చి ♦ యింగలమును
జేర్చి జలమాడి మడిఁగట్టి ♦ సిందురమును
బసము కుంకుమ లొంది పు♦ష్పములఁ జుట్టి॥

క॥ పతి యడుగులఁబడి యగ్నికి
నతిభక్తి ప్రదక్షిణంబు ♦ లమరించి మదిన్
శితికంఠు భక్తవత్సలు
హితమతియై సంస్మరించి ♦ యిట్లు భజించెన్॥

చ॥ విరులు మదింద్రియంబు లగు♦విస్ఫురితాగరుధూపమహా న
స్థిరహృదయంబగున్ స్తిమిత♦దీపము ప్రాణములున్ ప
కరణములౌ నవాత్మతని♦కాయము జీవుఁ డిఁ కర్చనాఫల
బరుదుగనౌత వత్సలత♦రాత్మ! యుమాహృదయానురంః

ఉ॥ ఒల్లను భోగభాగ్యముల ♦ నొల్లను నాకసుఖాలయంబు
నొల్లను బారమేష్ట్యపద ♦ మొక్కటిఁగోరెద దేవదేవ!
కల్లదియిమ్ము! జన్మముల ♦ నందెదనేనియుఁ దావకాంఘ్రి
ఫుల్లసుగంధపద్మరస♦భోజనభాజనభృంగి నౌదు తన్॥

ఉ॥ జన్మము లెన్నివందలను ♦ సంతనచేసిన సంతసంబె య
జ్జన్మమునందు నజ్ఞతకు ♦ సాధకమౌ నల మాయనీవు వ
స్మన్మనమందు నింక నిము♦సంబయినన్ భవదంఘ్రిపద్మ
వ న్మఱువంగనీకుము శి♦వా! కరుణాకర! నీవు మ్రొక్కె

అని రయంబున నాసతి ♦ యగ్గి దూఁకె
బాడబాగ్నులఁ బడుహిమ♦భాను భాతి
చండదహనార్చు లంతనే ♦ సమధికగతి
నెగసి తత్తనువును గాల్చె ♦ నెసఁగ బూది॥

బరుఁ డంత భస్మంబునుఁ జక్కఁ బడసి
కొన్ని వత్సరములదాఁకఁ ♦ గొదవ లేక
పూజ జరుగంగఁగల దని♦మురిసె భార్య
కై యొకింతేని వగపును ♦ గాంచఁడయ్యె॥

లమాడి మడుగుఁగొని భసి
తలేపమును జెంది దగ్ధ♦ధామముకడ న
స్థలముగ శివలింగార్చన
సలిపి ప్రసాదంబునొంది ♦ సంతోసమునఁ॥

నార్య దాహంబునొందుట ♦ భావమందు
మఱచి శంభుప్రసాద మా♦మగున కొసఁగ
నెడమదిశఁ గన దోసిలిఁ♦బడసి యాకె
లిచె నిర్మాల్యమిడె భర్త ♦ నెలఁత మొసవె॥

అంతన యతండు జ్ఞప్తినొంది.

అగ్గిలోఁ బడి బూది♦యైనను దిరుగఁ బూ
ర్ణావయవములతోఁ♦నమరుదాని
సెకపుటం బేసి తీ♦సినపై డితీవె నా
ధగధగద్ధగలతోఁ ♦ దనరుదాని
అలఁత నిట్టూర్పు సుం♦తైనను జెందక
చిఱునవ్వుమొగముతోఁ♦జెలఁగుదాని
తనసతిఁ జూచి త♦త్తనువునాపాదమ
స్తంబుఁ బరీక్షించి ♦ చాలవిస్మి
తుం డయి గృహంబుదెసఁ జూచు♦తోడ నద్ది
మును యథాపూర్వముగ నట ♦ నుంటఁ జూచి

మఱియు నక్కజపడి తన♦మగువను గని
యడిగె నివ్విధముగ సంశ♦యాళుఁ డగుచు॥

క॥ ఎవ్వతెవు నీవు మద్గృహ
మెవ్వాంఛఁ జేసి చేరి ♦ తివుదేకద నా
పువ్వుంబోడి చితిఁ బడి
యివ్విధి బూదియయి మిగిలె ♦ నెంతయుఁగనుమా!

క॥ అకట పిశాచివొ! కాక మ
ఱొకమాయాభామినివొ! మ♦దుద్ధతపైత్యా
త్మికవిభ్రాంతియొ! స్వప్నమొ!
యకుటిలమతితో వచింపు ♦ మంతయు వేగన్॥

తే-గీ॥ పారదారజభవమునఁ ♦ బడెడువాఁడ
నుచును దలపోసి తేనియు ♦ ను విను మట్టి
లౌల్య శైథిల్య మార్గావ♦లంబనుండు
కాఁ డెఱుకు పాయు మతనువై♦కల్య మింతి!

క॥ అన నల్లననగి యమ్మా
నిని యిట్లు వచించె నాథ♦నీ వనునది యె
ల్లను గల్ల నిజము నీప
త్నినె నే మరణింపలేదు ♦ నీ వదిగనుమా!

క॥ ఎపుడు భవదాజ్ఞఁగొని నేఁ
గృహపీటజార్చినిఁ బడితినో ♦ కించిచ్ఛ్రమ లే
కపుడందు నిదురనొందితి
నిపుడిటువచ్చితిఁ బ్రసాద ♦ మిందుఁ గుడువఁగాన్॥

తే-గీ॥ అనిన గృహమును బడఁద్రోచి ♦ యగ్గినిడిన
యట్టిదాన వీవేకదా ♦ యీావస్థమ
తొల్లియ ట్లుండెఁగను మనా ♦ నెల్లఁగలయఁ
జూచి యాయమ మదిని బల్♦చోద్యమందె॥

తే-గీ॥ వనచరకులీనుఁ డప్డు పూ♦ర్వమున జరిగి
నట్టివృత్తంబులాను వై♦యాత్యమొప్ప

నడిగి యాయమచే సత్యమరసి మురిసి
పాడవిస్మయకలితవై వశ్యుఁ డయ్యె॥ 92

ంత వారిద్వరు యథార్థ మరసి సర్వ
నది శివానుగ్రహవిశేష మనుచుఁ దెలిసి
భక్తిపరవశులై కృపాపరుని హరుని
సన్నుతింపుచు నిట్లు హర్షమున ననిరి॥ 93

తిరంబులు గడుపరమప
త్రంబులు శైలజాత్మవిభులీలాచా
త్రంబులు సకలజగ
త్రంబులు గాఁగ నెగడుమీఱుచు నెందున్॥ 94

వనములు సర్వసుధీ
సేవనములు దుఃఖరోగశిథిలితజనతా
వనములు పీయూషో
న్భావనములు పరమహర్షభరజనకంబుల్॥ 95

ట్లభినందించి భక్తిరసానందవాహినిఁ జొక్కియున్నంత.

—: భిల్లదంపతులుఁ కైలాసము జేరుట :—

లోననె వారిద్వరి
మోల విమానంబు రత్నపుంజమయము పు
ష్పాలంకృతమొక్కం డుడు
జాలశతవిభాస్వరంబు వాలె నమరికన్॥ 97

ందు నల్వురు వామదేవానుచరులు
ననులు రాజకిరీటసంకాశు లపుడు
వెలువడి నిషాదయుగ్మముఁ గలయఁ జూచి
యిట్లు పల్కిరి సంబరం బినుమడింప॥ 98

రాకొఱకై శంకరుఁడును
కరుణామృతమయాబ్ధి శివయును బ్రమథా

నీక మెదురుసూచుచు మ
మ్మాకరణిఁ బంపి రెవ్వఁడీపుష్పకముల్॥

తే-గీ॥ అనుచు వారల స్పృశియింప ♦ నప్డు వారు
శర్వసారూప్యమొందిరి ♦ శంభుభటులు
వారల విమానమునఁజేర్చి ♦ పరమశివుని
సముఖమును జేర్పఁగని వారి ♦ శంకరుండు॥

ఆ-వె॥ ఓనిషాద! నాదు♦నురము నాలింగింపు
మనియె శివయునుల్ ద♦దాత్మసతిని
నాళి!రావె కంఠ♦మాశ్లేషమునొనర్పు
మనుచుఁ బలికె మేదు♦రాదరమున॥

వ॥ భక్తినిట్లు మియట్లొందినవారలరుదు సంతతం బిందు లొనరించుచు సమక్షంబున నుండుఁడని నియోగించి వ బరమేశ్వరులు పరితుష్టులగుచుండి రిట్లు శబరుండు ని జాతుండైనను భక్తిచేసి పారమేశ్వరపదంబు నొందె.

—: భక్తిమాహాత్మ్య బోధోప సంహారము :—

చ॥ సకలజనోత్తమం బయిన ♦ జన్మము నొందిన నేమికల్గు
దికఘనశాస్త్రసంతతులఁ ♦ దెల్విఁ బఠించిన నేమికల్గుఁ ?
యక యెవఁ డంతరంగమునఁ ♦ బాశుపతాయతభక్తి ని
రకమగునట్టివాని సరి ♦ రారు జగత్త్రియ మందునెవ్వరు

ఉ॥ కావున సర్వమార్గముల ♦ కన్నను భక్తినె పెంపుసేయుఁ
భావములందు నెల్లపుడు ♦ భక్తనిధానునిఁ బార్వతీపతిఁ
బావనతేజుఁ గొల్వఁ డీక ♦ పార్థివముఖ్య!పరాత్పరుండ
దావహుఁడై మిముల్ మనుచు♦~~[illegible]~~దుఃఖము లంటకు

తే-గీ॥ భక్తి యనఁ బ్రేమ విశ్వాస♦భరిత మద్ది
దైవగురుతీర్థమంత్రౌష♦ధముల యందు
నెట్టిభావంబు జనుఁడొందు ♦ నట్టిఫలము
నొందును జగాన లే దిందు ♦ సందియంబు॥

ని యుపదేశించి మహా
నుఁ డాతఁ డనేకమనుజ♦కాండమునకు దీ
ను నొసఁగి వసుంధరలో
నుపమగతి శైవమతము♦నలరఁ జేసెన్॥ 106

ంతఁ గొన్ని దినంబులైనతటి న♦య్యాచార్యుఁ గన్నమ్మ దా
ంతై యొప్పజ్వరంబునన్ దనువు ని♦చ్చోఁ బాసి స్వర్గంగయై
ంతున్ శంకరుఁ జెంది మోదవడె లో♦క స్తుత్యుఁ డాచార్యుఁడున్
ంతన్ జెందక యౌర్ధ్వదైహికములన్ ♦ జేసెన్ విధానాకృతిన్॥

హరదత్తుఁడు గ్రామవృద్ధులతో కైలాసంబున కేగుట :—

పైఁ గొంతకాలంబు చనినంత నొక్కనాఁ డాచార్యుండు శివ
ంగార్చనన్ బొనరించుచుఁ గైలాసయాత్రసల్పుదు నని గ్రామస్థ
సల కెఱింగించి నంతనవ్వారిలో స్థవిరులగువారెల్లరును దమతో
నే వచ్చెదము - దమ్ముఁబాయలేమని ప్రార్థించుడు నాచార్యుం
ప్రుడు శివానుగ్రహంబుతోఁ గైలాసంబునుండి యొకపుష్పకం
ఁదెప్పించి యందఱ నందు నారోహింపఁజేసి తాను సంతా
బు నాశీర్వదించి పత్నీసహాయుండై పుష్పకంబెక్కిన నెల్లర
ుడు మానుష దేహంబులు మాఱి దివ్య దేహంబు లమరె హార
త్తాచార్యుండును యథాపూర్వంబుగ మహాకాలగణేశ్వరుండ
కుఁ దత్పతి తత్పతియయ్యె ననంతరం బందఱతో.

ృచరితుఁడైన♦హారదత్తుఁ డిట్టుల
షమాసశుద్ధ♦పంచమీక
వమందుఁ బ్రణవ♦విజయధ్వనులతోడ
పదంబుఁజెందె ♦ శిష్టు లలర॥ 109

మేశ్వరుండును వచ్చినవారి కందఱ కందు స్థానంబులొసంగి
-కాళుఁ బ్రీతిచేసి పూర్వపదంబొసంగె నాసమయంబు నం
క్కవృద్ధా గన గణపత్యర్చనకై శివాలయంబున కరిగియున్న
నాయమమాత్ర మావిమానంబెక్కి చనక యుండుట నారసి

# పంచమాశ్వాసము

గణేశుండామెకు దివ్యదేహంబిచ్చి దివ్యయానంబుతో
జేరఁబంపుడు నాయమయు నందుఁజేరి సుఖంబుండె.

## —: ఫలశ్రుతి :—

క॥ ఈ గురుచరితము నెవ్వఁడు
బాగుగఁ జదివినిన వినిన ♦ భర్గుఁడు ప్రీతిన్
భోగము మోక్షమువారికిఁ
దాఁగూర్చును సందియంబు ♦ తగ దీయెడలన్॥

క॥ జయ మగు మల్లేశ్వరునకు
జయమగు భ్రామరికి భక్త ♦ జనరక్షణికిన్
జయమగు గజముఖగుహులకు
జయమగు వీరేశ్వరునకు ♦ శాశ్వతము రహిన్॥

క॥ మందాకినీధునికిని
నందికిఁ జండీశునకును ♦ నానాగణరా
డ్బృందమునకు ద్రిశిఖమునకు
నిందుకలకు శేషునకును ♦ నెసఁగు జయంబుల్॥

క॥ శ్రీపర్వతరాజమునకు
నాపాతాళధునికిన్ మ ♦ హావిక్రాంతం
బౌపాశుపతాస్త్రమునకు
శ్రీపాశుపతులకు విజయ ♦ సిద్ధు లెసఁగుతన్॥

## —: శ్రీమల్లేశ్వర ప్రార్థన :—

క॥ నీ కిచ్చితి మల్లేశ్వర!
యీకావ్యకుమారి నెంతో ♦ యింపుగ దీనిన్
జేకొని పాలింపుము కృప
నాకైరవబాంధవోడు ♦ హారిదశ్వముగాన్॥

క॥ ఇది నిర్దుష్టయు గుణవతి
మృదులయు లలితయును గడుస ♦ మీచీనార్థా

దయును విదుషియు నయి తగ
దయాత్మా! యేలుకొనుము సంతతము రహిన్॥ 11

ఆశ్వాసాంతము.

సులా ప్తకమలశాత్రవ
మలోద్భవదివ్యనయన కమలత్రయ! యు
త్తమచామీకరవిగ్రహ
మణీయ! శ్రీగిరీంద్ర రాజ్యాధీశా! 117

టవిశంకటపాటల
కురజటాజూటకలిత శీతద్యుతిశా
క! వికలితరావణదో
కరమదాతిశయ! పుణ్య నిధి! మల్లేశా! 118

కావృత్తము॥ యోగీంద్రమానసప యోరుహరత్నకోశ
శ్రీగేహజాగరవి శిష్టతరాత్మమూర్తీ!
రాగవ్యథామయని రంతరఖిన్నజంతూ
ద్వేగప్రమాపణసు తీక్ష్ణపవిత్రనామా! 119

ది శ్రీమదుమామహేశ్వరకరుణాప్రసాదితసుకవితా భాగధేయ
భజనవిధేయ ముదిగొండనాగవీరేశ్వరనామధేయ విరచితంబైన
రదత్తవిజయకావ్యంబందుఁ బంచమాశ్వాసము సర్వము
రూపము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





# హరదత్త విజయము

## శ్రీ మంత్రాధ్య కవివిరచితము

ఆర్యావృత్తములు

శ్లో॥ గజరాజరాజవదనం । కరుణానిధి మీశ్వరాత్మజం వందే
యన్నామస్మృతిమాత్రాత్ । సద్య శ్శాంతిం ప్రయాంతి ప్ర

శైవమతావనహేతో । శ్శివశాసనసంప్రచోదితో ఖ్యాతః
గణరాట్ స మహాకాలో । కైలాసా న్నిర్గతోఽనివార్యర

కాంచీపట్టణనివస । చ్ఛ్రీవైష్ణవవిప్రసూరిజాతాయాః
పూతాయాః కన్యాశ్చ । ద్గతభర్తు ర్గర్భమాప శివయోగాత్

అంతర్వత్నీ మథ తాం । వీక్ష్య వితంతుం స్వకీయకులముఖ
ప్రసభ మతిధర్షయిత్వా । క్రోధవశా ద్గేహాతో బహిశ్చక్రుః

తద్భవనపశ్చిమాశా।పశుకోష్ఠే సావధూ ర్వ్యథాభీరి
స్ఫుటమతి రనఘా స్థైర్యాదువాస పరమేశ్వరాధిగతభావా॥

పరిపక్వగర్భభారా । రజనీమధ్యేఽ జభేచ కస్మింశ్చిత్
పంచగ్రహోచ్చకాలే । సుషువే సా పుత్ర మీశసంకాశ

బాలో బాలేందురివా । హ్లాదకర శ్శ్రీకరశ్చ మాతృముఖం
పరివర్ధితతను రాసీ । త్పంచాబ్ద షోడశాబ్దమూర్తి రివ॥

అనితరసామాన్యచ్ఛవి । మనఘం స్వకుమార మీక్ష్య సా
హరదత్త స్యాత్మశిశో। ర్హరదత్తాహ్వాయ మనుమతమం చ

సవయస్కైః స్తోకైః సోఽక్రీడాలోలైస్స్వయ మపాకృష్టః
కులటాసుత ఇతి శప్తస్త్యక్త్వా తాన్ మాతరం సమాగచ్ఛ

ిహి జనయిత్రి! క స్తే । నాథో జనకశ్చ మామక స్సత్యం
చే త్త్వా మిహా హత్వా । తథా మరిష్యేఽ హమపి భృశం వేగాత్॥
'భైషీ స్త్వ మపాపే । పథి సంచార స్తవ ప్రసూ ర్భవ్యః
ంతరే భవతి య।ద్భావ్య మలం సంశయాయ వద! తూర్ణం॥ 11

తనుజేన పృష్టా । స్పష్టం ప్రోవాచ సుచరితాఽ చకితా
ఏకజనక శ్శర్వ । స్సర్వజగన్నాథ ఏవ మన్నాథః॥ 12

తస్యాంబ! క్షుత్రవాసః-(మాతా)శివకంచ్యాం భర్మహర్మ్యభవనేంతః
సహచరవర్యాః కేతే-(మాతా)కమలజకమలాక్షముఖమరున్నాథాః॥

సమాగచ్ఛ! త్వం । గచ్ఛామ్యహా మావసామి పితురంకే
మిహ నస్థాస్యేహం । బోధమితీదం సముచ్చరన్ ప్రయయా॥

ర్గ మిాక్షతీ సా । తమనుయయా వాసభూమి ముత్సృజ్య
ిత పురః కుమారో । అనుధావ త్యంబికాపి తం పశ్చాత్॥

స్తతో జగామాఽ । యతనం దేవస్య చైకచూతవిభోః
ఏనుజగామ తదంబా । వత్స మనుసృత్య ధేనురివ వేగాత్॥

మయే శశిమాళే । ర్గర్భగృహద్వారమాస్థితం బంధైః
మిాత్య ముష్టిఘాతై । ర్బాలో భిత్వా వివేశ తద్గేహం॥

చ న్మాతు స్తస్య । ప్రవేశసమయే కవాటయో ర్బంధః
వ్యభూత్సశిలా । సాఽ ర్తా విలలాప వీక్ష్య భృశ ముచ్చైః॥
ంచవిఘటికాంతిమకాలే బాలో నవోపవీతేన
కాక్షశర్వలింగై । రంచితతను రాజగామ తద్ స్థానం॥

క్ష్య తనయ మారాత్।సుచరిత్రాఽ తీవ హర్షితా పుత్రం
సీత్వా వక్త్రం । చుచుంబ బహువార మున్నతప్రీత్యా॥

సో జననీం నత్వా । కృతముపయనం శివేన జనకేన
ంగధారణంచా । నివేదయ ద్దత్తమఖిలవేదచయం॥

స్యచ తన్మాతు । ర్వృత్తం సర్వం విచిత్ర మభివీక్ష్య
త్యా స్సర్వజనాః । ముదమాపు ర్గాఢవిస్మితాత్మానః॥ 22

సద్య స్సర్వే తే తద్బాలం చాంబా మతీవప్రస్తుత్య
సర్వేష్టై ర్ద్రవ్యైస్తా । వత్యంతంప్రీతితో బహుమాకుర్యుః॥

స్వీయ మథ తదుత్తరేహని । హరదత్త శ్చోళభూమిపాలాయ
రచయిత్వైకాం లేఖాం । వాదార్థ మరేణ ప్రేషయామాస
ఆవాహాయ చోళవిభో । గోష్ఠీమధికృత్య పాంచరాత్రబుధాన్
శివఏవ తత్త్వమితి తాన్ । విజయిష్యే తత్ప్రథమం హారిష్యేఽ
సిద్ధే మామకవిజయే । భూయా స్త్వం క్షిప్రమేవ పాశుపతః
పక్షాంతరే మదీయం । మస్తం విచ్ఛేద యాఽసినా సద్యః॥

ఇతి పత్రికాం మహీభృస్నికట మగమయ త్తదా కుమారో
చోళేశ స్తాం దృష్ట్వా । క్షణమపి జ్ఞాత్వాఽద్భుతమతిం ప్రా
జ్ఞో విధథాస్యే విద్వద్గోష్ఠీ మాగచ్ఛ నియతమంగ! ఇతి
దత్త్వోత్తర మతివేగా । ద్వైష్ణవముఖ్యా నచోదయ ద్ధీరాన్
ఉషసి పరేద్యు ర్వ్రతోస్న । విరచితశివలింగపూజనావసరః
లబ్ధ్వాఽ శివ మంబాయాః । ఆస్థానీ మావిశ న్మహీభర్తుః॥
తత్పూర్వమేవ రాజ్ఞా । నీతా జేతార ఏవ గోష్ఠీషు
ప్రతివాదిభీకరాద్యాః । శ్రీవైష్ణవపండితా స్సమాజగ్ముః॥
హరదత్తోఽపి హి సమితిం । ప్రాప్య శ్రీవైష్ణవాభిముఖపీఠే
ఆరుహ్య దేవదేవం । హృదయే సస్మార శివ ముమానాథం
ప్రతిపక్షా బహవ స్తే । బహువిధ మాచక్రిరే వివాదనదం
నిపుణమతి ర్హరదత్తః ఖండన మకరో త్తదీయవాదతతేః॥
పున రేకైకం నీత్వా । వేదశిఖానిర్ణయప్రమాణశతైః
శివ ఏవ తత్త్వమితి విజ్ఞానాం స్పష్టీచకార రాజాగ్రే॥
ముగ్ధా స్సంత స్సర్వే । వైష్ణవకులజా నృపాలకం ప్రోచుః
శుద్ధోఽస్మదీయవాదః । జితా వయం బాలకేన జాలేన
జ్ఞాత్వైత త్సర్వం భూపతి రధికం మనసి చింతయామాస
విజితా వైష్ణవధీరా । స్సత్య మపీదం త్యజంతి నచ శాఠ్యం॥
ఇతి చింతాయుతమనసం । హరదత్తో వీక్ష్య భూపతిం ప్రాహ

ణిం జ్వలదగ్నిం । ఆయస మేకో త్తరశతసోపానం॥ 42
ష్మనాథగోపుర । మధిసంస్థాపయ విభో౽హ మతివేగాత్
హాయామి త త్త్వం । శివ ఏవేతి బ్రువన్ పుర స్తేషాం
ను త్తైరపిచ తథా । కుర్యుర్యది మామకీనశీర్ష మరం
దయ నిజఖడ్గా । దన్యైః కోలాహలైశ్చ కిమనేకైః॥ 43
న త్తస్య వచ స్తాచ్ఛ్రుత్వా౽ పూర్వంచ విస్మయం గత్వా
యిత్వా నిశ్రేణిం । తథా౽కరో జ్జనసమక్ష మధినేతా॥ 44
నత్తో ప్యతివేగా । దుచ్చైః శ్శివఏవ కారణం జగతాం
బాఢ మావదన్ తా।మారుహ్య వివేశ గోపురస్యాగ్రం॥ 45
ః పలాయనం తే । చక్రు శ్శైవైష్ణవో త్తమా స్సర్వే
ష్ట్వా స్సకలజనాః । హరదత్తా యోన్నతం నమశ్చక్రుః॥ 46
రాశ్రప్రార్థనయా । హరదత్త స్సో యధారుహో తథా
మవరురోహ తస్మై । భూమిపతి ర్దండవ న్ననామ బహు॥ 47
న త్త స్యాంఘ్రియుగే । నిజమౌళిం సన్నివేశ్య భూమిపతిః
ష్టేయస్యా౽ర్థనయా । శివలింగధృతిం సమగ్రహీ త్సద్యః॥ 43
కే స బహుద్రవ్యం । దత్వా౽ తతన స్తువాహనం హర్మ్యం
గత శైవవిబుధా।నకరో దావాహ్య ధర్మనిర్ణేత్రూన్
్ర సాక మథాసౌ । శైవబుధైః పరిచరైశ్చ సహితస్సన్
ఇహిమనగాంతం । యాత్రా మకరో త్పవిత్రతీర్థతతేః॥ 49
చ తత్సమయే । శైవాగమజాలపారదృశ్వానం
కంఠవిబుధం । దేశిక మధిగమ్య తత్ప్రసాద మియాత్॥ 50
యాత్రాచరణే । విద్యాస్థానేషు సర్వనగరేషు
ఏవ కేవల ఇతి।త త్త్వం సంసత్సు సంవిదాంచక్రే
స్య తతో నగరీం । కాంచీ మధిపేన సత్కృతః ప్రీతః
హ మామ్నాయశిఖా।లంకారం శర్వ మావద న్నాస్తే
పతే రనుమత్యా । శుభే౽హని ప్రముఖబాడబః కశ్చిత్
కత్తాయ స్వసుతాం । అనురూపగుణాం దదౌ వివాహవిధౌ॥ 51
గాదేవ కుమారాః । కుమారికా స్తస్య చాత్మసమభాసః

తస్యాం జాతా నీతాః । వృద్ధిం సర్వాక్షిపర్వసంధానాః॥
అనురూపేభ్యః పుంభ్యః । కన్యాశ్చాలంకృతా దత్వా
ఉపయమ మకరో ద్బహుతర।పరిబర్హేణాఽత్మగౌరవోన్న
పుత్రౌ నామ్నాయశిఖా।విద్యాపూర్ణాన్ విధాయ సత్కనా
మాన్యా రూపగుణాఢ్యా । మయోజయత్ పాణిపీడనేన సు
నీత్వా కతిపయకాల। మేవం సోథాఽబ్రవీ న్మహీభర్త్రీ
సంస్థాప్య పత్య మిహా।శ్వః కైలాసాచలం గమిష్యామః
శివభక్తి మాదధానో । భవాన్ మహీం పాలయతు చిరం ;
ఆవాహయామి వేగా। దీశపదప్రాపకం విమాన మితః॥

ఇత్యాభాష్య పరస్తా । దహని ధ్యానేన శర్వ మాత్మగురుం
విజ్ఞాప్య తత్ప్రసాదా। దానయ దాకాశయాన మతిరుచిరం
పుత్రైః పుత్రీన్ బంధూన్ । సర్వా నపిసాంత్వయన్ భృశ
జనయిత్వాచ సదారో । సమారురోహాఽం తరీక్షగతి మనః
స్థవిరాః కాంచీవాసాః । సర్వే హారదత్త మంజలింకృత్వా
తదనుజ్ఞా మధిగమ్య । స్మరంత ఈశం తదారురోహ రహో
పుష్పై శ్శ్రీఫలపత్రైః । రత్నై ర్ముక్తాఫలై శ్చ బహులవిధం
అర్చిత మంబరయానం । జగామ వేగేన శంభుపద ముచ్చై
ఆగత్య చరణనికటే । పతితాన్ హారదత్త మంబికాం తస్య
పత్నీం చాన్యజనాన్ తాన్ । శర్వ స్స్వానదర్శనాయత్ ప్ర
శివసందర్శనమాత్రాత్ । హారదత్తస్య ప్రిపూ రధికవేగా
గంగామూర్తిం లబ్ధ్వా । హారమాళిం ప్రాప్య మోద మధిగ
శంభుప్రసాదయోగా । ద్ధరదత్తో జాయయా సమేతస్సన్
ఆప మహాకాళపదం । ప్రమథామరవంద్యమాన మసమానం
హారదత్తస్య హిచరితం । శివభక్తై ర్జనక మద్భుతం చేదం
శ్రుత్వా జనః పఠిత్వా । శివప్రసాదం ప్రయాతి భూరిముదం
ఔద్భటమంత్రారాధ్యో । హారదత్తాచార్యదివ్యచరిత మిదం
విరచయ దార్యారమణాసక్తానాం । ప్రీతయే సుభక్తానాం॥

శ్రీపార్వతీపరమేశ్వరార్పణమస్తు – శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ